# యువ విజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:
Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

పదమూడేళ్ల గౌరవ్ రాజేష్ భండారీ పుణెలోని సింబి యోసిస్ ఉన్నత పాఠశాలలో 8 వ తరగతి చదువుతు న్నాడు. గత 3 సంవత్సరాలుగా వాలీబాల్ ఆడుతున్న గౌరవ్ ఇంతవరకు 30 పైగా పాఠశాల జట్లను ఓడిం చాడు. తన స్కూల్ జట్టుకు ఇతను కెప్టెన్‌గా వ్యవహరి స్తున్నాడు. 2011లో పన్హాలా ఇంటర్నేషనల్ కోచ్ అజిత్ పాటిల్ ద్వారా ఉత్తమ వర్ధమాన క్రీడాకారుడుగా మరియు ఉత్తమ టోర్నీ ప్లేయర్‌గా అవార్డ్ పొందాడు. పూనా స్పోర్ట్స్ అథ్లెటిక్స్ అసోసియేషన్‌చే ఉత్తమ ఆల్ రౌండ్ ప్లేయర్‌గా ట్రోఫీ సాధించాడు. అలాగే సఖరామ్ మోరె క్రీడా ప్రతిష్టాన్ నుంచి మ్యాన్ ఆఫ్ ది టోర్నమెంట్ అవార్డు కూడా పొందాడు.

తను సాధించిన విజయాలకు తన తల్లిదండ్రులు, కోచ్‌లు కోక్రె మరియు బామ్నెలే కారణమని గౌరవ్ చెబుతున్నాడు. చదువుతో పాటు అబాకస్, చిత్ర లేఖనం, ఈత, సింథసైజర్‌ను వాయించడం, నాట్యం వంటి వాటిలో కూడా ఇతడు ముందు ఉంటున్నాడు. వీటిలో చాలా పతకాలు సాధించాడు కూడా.

గౌరవ్ సాధించిన విజయాల వెనుక తీవ్ర కృషి, నిల కడతనం, అంకితభావం వంటివి ఉన్నాయి. తరగతి గదిలో కూడా తాను శ్రద్ధగా పాఠాలు వింటానని, శక్తి మేరకూ చదువుతానని గౌరవ్ చెబుతున్నాడు. కఠిన శ్రమకు, విజయ కాంక్షకు ప్రతీకగా నిలుస్తున్న గౌరవ్‌కు మంచి భవిష్యత్తు కలగాలని ఆకాంక్షిస్తున్నాము.

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 August 2012 Issue-08








August 2012 ₹25/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Customer Help :**
Ph: 022 40786043
customerhelp@chandamama.com

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh. Editor :- Prashant Sharad Mulekar


T

# స్వాతంత్ర్య దినోత్సవం

ఆగస్ట్ నెల సంపాదకీయం పూర్తి చేయడానికి సిద్ధమైనప్పుడు గత సంవత్సరం చందమామ సంపాదకీయాన్ని మళ్ళీ చదివాను. దాంట్లోని సారాంశాన్నే మళ్లీ ఇక్కడ పొందుపరుస్తున్నాను. ఈ సంవత్సరం కూడా ఆ విషయం సందర్భోచితంగా ఉంటోంది.

బ్రిటిష్ వారి నుండి మనం 65 సంవత్సరాల క్రితం స్వాతంత్ర్యాన్ని పొందినప్పటికీ స్వాతంత్ర్యం యొక్క నిజమైన అర్థాన్ని పొందడంలో మనం ఇప్పటికీ ఘర్షణ పడుతూనే ఉన్నాము. వానదేవుడు శీతకన్ను వేస్తే వచ్చే సంవత్సరం పంటలకు నీటి సరఫరా ఎక్కడి నుంచి తీసుకురావాలని మనసులో భయపడుతూ మనం నేటికీ వర్షాల రాక కోసం ఆకాశం కేసి చూస్తూనే ఉన్నాము. మన ప్రాథమిక అవసరాలు నేటికీ నెరవేరడం లేదు. ఒత్తిడికి లోనవుతూ మన మౌలిక వసతుల కల్పనా వ్యవస్థ కుప్పగూలుతోంది. మన పురోగతి మొత్తంగా నిష్ప్రయోజనకరంగా కనిపిస్తోంది. మన దేశవాసులు ప్రాణాలు ధారపోసి స్థాపించిన విలువలను మనం ఎత్తిపట్టడానికి వెనుకాడుతున్నట్లుంది.

అలా అని మనం ఆశను వదిలిపెట్టినట్లు అర్థం కాదు. యువతరంపై మనకు విశ్వాసం ఉంది. కొంత కాలం క్రితం ప్రారంభించిన మార్పులు మనం కోరుకుంటున్న ఉజ్వల భవిష్యత్తును సాధిస్తాయని మేము నమ్ముతున్నాము.

భారమైన హృదయంతో, చందమామ సంథాలీ సంచిక ప్రచురణను ఈ నెల నుంచి నిలిపివేస్తున్నామని మా పాఠకులకు చెబుతున్నందుకు మేం ఎంతగానో చింతిస్తున్నాము. సంథాలీ పాఠకుల నుంచి తగినంత స్పందన రాకపోవడం, సంథాలీ భాషలో ఏకైక పిల్లల పత్రిక అయిన చందమామకు ప్రభుత్వం నుంచి ఎలాంటి మద్దతు లేకపోవడమే ఇందుకు కారణం. అదే సమయంలో ప్రపంచ వ్యాప్తంగా పాఠకుల వద్దకు చందమామను తీసుకుపోవడం అనే లక్ష్యాన్ని కొనసాగిస్తాము కూడా.

చందమామ పాఠకులందరికీ స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



నాలుగో తరగతి చదివేటప్పుడు తొలి చందమామను ఒక అణా పెట్టి కొన్నాను. నాటినుంచి నేటి వరకు మా కుటుంబమంతా చందమామను చదువుతూనే వస్తోంది. మా పిల్లలు వాళ్ల పిల్లలు అందరూ చందమామ అభిమానులే. నా మనవళ్లు చందమామ కథలను నాతో చదివి చెప్పించుకుంటారు. ప్రస్తుతం లండన్‌లో చదువుతున్న నా మనవడికి తెలిసినవాళ్లు అక్కడికి వెళ్లినప్పుడు చందమామ తీసుకుపోయి ఇస్తే మమ్మల్నందరినీ చూసినంత సంతోషం వేసిందట. చందమామ ఇంకా బాగుండాలి. – ఎస్. అమరావతి, కాకినాడ, ఎపి

చెన్నయ్‌లో చందమామ ఆఫీసును ఇటీవలే సందర్శించినప్పుడు 30 ఏళ్ల వెనుక నేను చందమామలో పనిచేసిన జ్ఞాపకాలు గుర్తుకొచ్చాయి. ప్రస్తుత చందమామలో చాలా మంచి మార్పులొచ్చాయి. పాత చందమామనే గుర్తు తెస్తున్న లే అవుట్‌తో పత్రిక చాలా బాగుంది. ఒక పేజీ కథల కోసమే చందమామ చదువుతాను. అంత బావుంటాయవి. జూన్ సంచికలోని 'పనికిరాని సాధనం' నిజమైన పాతకథ. నక్కను భయపెట్టడానికి కుందేలుకు కట్టుడు కోరపళ్లు అమర్చడం కాదని, దాని పిరికిగుండెను మారిస్తే గాని కుందేలు సమస్య తీరదని ఈ కథ ఎంత చక్కని నీతిని బోధించిందో! నెలకు ఇరవై కథలు పాఠకులకు ఇవ్వడం చందమామకు తప్ప ఏ పత్రికకు సాధ్యం మరి! – *గంగిశెట్టి శివకుమార్, నెల్లూరు, ఎపి*

పత్రిక చాలా ఆలస్యంగా అందుతున్నందుకు నిరాశగా ఉంది. ప్రయోజనాత్మక కథలకు మారుపేరు చందమామ. కాని మే నెలలో రెండు కథలు భిన్నంగా ఉన్నాయి. 'కోడిఖరీదు' కథలో ముగింపు సరిగా లేదు. 'పేరయ్య తిన్న కోడి పిల్లల్ని పెట్టగా లేనిది ఈ వేయించిన విత్తనాలు మొలకెత్తవా అని అనుకున్నాను,' అని కరణం అనగానే ఆ ఎత్తిపొడుపుకే కోటయ్య సిగ్గుపడి కోడి ఖరీదు తీసుకోకపోవడం భూస్వామి నైజం దృష్ట్యా సరికాదు. ఇక 'నమ్మక ద్రోహం' కథలో 'మా వృత్తి వర్తకం చేసుకోవడమే గాని దొంగలను పట్టడం కాదు' అంటూ హిరణ్య గుప్తుడు సమర్థించుకుంటాడు. అలాగైతే దొంగబంగారం కొనేవాళ్లంతా అలాగే అంటారు కదా. ఈ కథలో ఎలాంటి సందేశమూ లేకపోగా దొంగబంగారం కొనేవాళ్లను ప్రోత్సహించినట్లుగా ఉంది. ఆలోచించగలరు. – మాధవీసనారా, అనకాపల్లి, విశాఖపట్నం, ఎపి

పదేళ్లకు పైబడి, చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీలో నా పేరు చూసుకోవాలని తహతహలాడాను. కాని అంబలి కోరుకుంటే, అమృత పరమాన్నం దక్కినట్లు.. ఏప్రిల్ మరియు జూన్ సంచికలలో నా కథలు 'చెల్లని నాణెం', 'కన్నీటి విలువ' ప్రచురించబడ్డాయి. చందమామ కథలు చదువుకుంటూ పెరిగిన నేను పత్రికలో నా పేరును నా కళ్లతో చూసుకోవడం అంటే, చందమామ అభిమానులైన మా పూర్వీకులకు ఘననివాళిగా భావిస్తున్నాను. ఇది నా జీవితంలోనే ముఖ్యమైన ఘట్టం. చిన్నప్పుడు మాకు చందమామను పరిచయం చేసిన నాన్న ఇప్పుడుంటే ఎంత సంతోషించేవారో. – జూన్ కెనడీ, రంగారెడ్డి జిల్లా, ఎపి

జూన్ చందమామ మూడో వారం చివర్లో కూడా లభ్యం కాలేదు. వచ్చిన పత్రికను చూసి ఆనందించడం, కథలన్నీ ఆబగా చదవటం షరామామూలే కాని అన్ని పత్రికలూ వచ్చిన మూడు వారాల వరకు సంచిక విడుదల కాకపోతే పత్రిక పరిస్థితి దెబ్బతింటుందేమో ఆలోచించండి. – రాజేష్, హైదరాబాద్, ఏపి

జూన్ సంచికలో చిన్నకథలు వేటికవే సాటిలేని విధంగా ఉన్నాయి 'రహస్యం', 'పనికిరాని సాధనం', 'పనివాడు', 'మేలైన మెచ్చుకోలు' కథలు ఆద్యంతం అలరించాయి. ఏ పత్రికలోనూ ఇంత నీతిమంతమైన చిన్న కథలను చూడలేదు. – నాగేశ్వరరావు, ఏలూరు, ఏపి

'రెండు రహస్యాలు', 'పరిశుద్ధుడు' కథలు రెండూ చక్కటి నీతిని బోధించాయి. మంచి ఊరు, చెడు ఊరు గురించి శంకరాచార్యుడు వివరించిన తీరు హృద్యంగా ఉంది. ఇక ఉపాధ్యాయుడి కొలువు అంగడి వస్తువు కాదని, దాన్ని అమ్మలేమని పాఠశాల నిర్వాహకుడు చెప్పిన తీరు కదిలించింది. – యజ్ఞన్న శాస్త్రి, వేటపాలెం, ఏపి

చందమామలో కథల నాణ్యత ప్రస్తుతం అంత బాగున్నట్లు లేదు. దేవీ భాగవతం, వీర హనుమాన్, మహాభారతం చందమామకు వన్నెతెచ్చాయి. ఇప్పుడు చందమామ ఆత్మ కోల్పోయినట్లుంది. శిథిలాలయం సీరియల్ మాత్రం అద్భుతం. – విజయ్ చౌహాన్, ఉత్తర ప్రదేశ్

చందమామ గత సంచిక అందిన వెంటనే ఆబగా చదివేశాను. మండువేసవిలో మలయమారుతంలా అనిపించింది. సంచిక మొత్తం చక్కగా ఉంది. చందమామ ధర పెరుగుతోందని విన్నాను. పరిస్థితి ఇంత తీవ్రమయ్యేంత వరకు మీరు ధర ఎందుకు పెంచలేదని ఆశ్చర్యంగా ఉంది. ధర ఎలా ఉన్నా నాలాంటి పాఠకులం ఎప్పుడూ చందమామతోటే ఉంటాము.

– ప్రొఫెసర్ సందీప్ కుమార్, అమృత్‌సర్

ఢిల్లీలో ఉంటున్న నాకు ఇరవయ్యేళ్లు. చందమామను చిన్నప్పటినుంచే చదువుతున్నాను. చందమామ, దాని అద్భుత చిత్రాలు నన్నెప్పుడూ ఆకట్టుకుంటుంటాయి. పాత కథలు మరీ బాగుంటాయి. చందమామను తిరిగి పాత రూపంలోకి తీసుకురండి.

– స్వాతి, ఢిల్లీ

నిన్ననే జూన్ చందమామ చూశాను. నిజంగానే పౌర్ణమి నాటి చందమామను చూసినంత ఆనందం కలిగింది. రాత్రంతా కూర్చుని మొత్తం పత్రికను ఆరుసార్లు చదివాను. కవర్ పేజీ నిజంగా నాకు ఒక గిఫ్ట్ ఇచ్చినట్లే ఉంది. చందమామను మాకు ఇస్తున్నందుకు కృతజ్ఞతలు. రియల్లీ ఐ మీన్ ఇట్. – డాక్టర్ సిరి, మిర్యాలగూడ, నల్గొండ

చందమామ మొన్ననే అందింది. నిద్రావస్థలో ఉన్న కుంభకర్ణుడి ముఖ చిత్రం అత్యద్భుతంగా ఉంది. మళ్లీ పాత చందమామను చూస్తున్నంత అనుభూతి. ఆర్ట్‌బుక్ నుంచి వేసిన శ్రీకృష్ణుడు ఎంత సుందర మోహనరూపుడిగా ఉన్నాడో! శిథిలాలయం సీరియల్-పూర్తి పేజీ చిత్రంలోని రాత్రిపూట అటవీ సౌందర్యం జిగేల్మంటోంది. ఎంత గొప్ప చిత్రాలు...! నిజంగా చందమామ ఒక అద్భుత లోకం. – రామచంద్రయ్య, కర్నూలు, ఏపి

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**

**Go to www.chandamamashop.com & subscribe Now!!**



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 11 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex :..................................

Address: ......................................................................................

......................................................................................................

......................................................................................................

.................................................... City: ...........................................

State:........................................ Pin:.............................................

Telephone:....................................................................................

Mobile:.........................................................................................

Email:...........................................................................................

Subscription Number (for renewals):................................................

Gift Subscription to the following address:

......................................................................................................

......................................................................................................

......................................................................................................

......................................................................................................

Enclosed Cheque/DD* for Rupees................................................

Cheque/DD No ..........................................................................

favouring Chandamama India Ltd on..............................................

......................................................................................bank.

Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 30/- per copy) | Rs. 360 | Rs. 645 | Rs. 915 | Rs. 1150 | Rs. 1350 |
| You Save | | Rs. 75 | Rs. 165 | Rs. 290 | Rs. 450 |
| REGIONAL (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 260 | Rs. 375 |
| JUNIOR (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 765 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 195 | Rs. 300 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - కన్నడ

నేను 1979లో ఎస్ఎస్ఎల్సి పూర్తి చేశాను. మా కుటుంబంలో నేనే పెద్దకొడుకుని. ఆర్థిక కారణాలతో చదువు కొనసాగించలేకపోయాను. నాకు 6 గురు సోదరీ సోదరులు న్నారు. ఆ సమయంలో నాకు మార్గ దర్శకత్వం వహించిన ఉపాధ్యాయుడు, కాలేజీ విద్య కంటే ఎక్కువగా జీవితానుభవాన్ని ఇచ్చినదీ, నా మనస్సును పదునెక్కించినదీ ఒక్క చందమామే అని చెప్పడానికి గర్వపడుతున్నాను.



Name: Rajendra Hegade
Occ: Revenue, dept.,
Haveri, Karnataka.

గ్రంథాలయానికి వెళ్లి చందమామను క్రమం తప్ప కుండా చదివేవాడిని. మా నాన్న పదవీవిరమణ చేశాక, పిడబ్ల్యుడి విభాగంలో కూలీగా చేరాను. అప్పట్లో నాకు రూ.150లు మాత్రమే నెలజీతంగా వచ్చేది. ఆ జీతంతోనే నేను చందమామను ప్రతి నెలా కొంటూ, క్రమం తప్ప కుండా చదువుతూ వచ్చాను.

చందమామ నా పదజాలాన్ని పెంచింది, నాకు జ్ఞానాన్ని ఇచ్చింది. చందమామను వరుసగా చదవడం ద్వారా వ్రాయడం నేర్చుకున్నాను. నా రచనలు పలు పత్రికలలో ప్రచురించబడ్డాయి. చందమామలోని నీతికథలు నేను మంచి చెడులను నిర్ణయించు కోవడంలో సహాయం చేశాయి. అలా చందమామ నా అభిమాన పత్రిక అయిపోయింది.

నేను 1991లో రెవెన్యూ శాఖలో చేరాను. అక్కడ కూడా గ్రామీణ ప్రజల మనస్సులను అర్థం చేసుకోవడంలో, అమాయక పల్లె ప్రజలతో వ్యవహరించడంలో చందమామ కథలు, కథనాలే నాకు సహాయపడ్డాయి. దారిద్ర్యంలో ఉన్నప్పుడు నాకు స్వాంతననిచ్చిన చంద మామే ఆర్థికంగా నేను ఎదిగిన తర్వాత కూడా నా ప్రియమైన పత్రికగా వెంట నడిచింది. టెలివిజన్, మొబైల్ వంటి ఆధునికతా రూపాలలో సంపద ఎన్ని వికర్షణలను కొని తెచ్చినా నా మనస్సులో మాత్రం చందమామ ప్రత్యేకంగా నిలిచిపోయింది.

నిరాడంబర జీవితాన్ని గడపటంలో చందమామ నాకెంతో సహాయపడింది. స్వామి వివేకానంద, శారదా దేవి, రామకృష్ణ పరమహంస జీవిత చరిత్రలు నన్నెంతగానో ప్రభావితం చేశాయి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆరు శత్రువులతో వ్యవహరించడంలో చందమామ నాకు సహాయపడింది. వీటిని ఎలా అదుపు చేసుకోవాలి అని చందమామ నాకు నేర్పింది. నా మనస్సును ఆరోగ్యంగా ఉంచుకోవడంలో కూడా చందమామ నాకు తోడ్పడింది.

ఆకలికి ఆహారం ఎలాగో, విజ్ఞానానికి చందమామా అలాగే మరి. పర్యటన, అధ్యయనం అనేవి ప్రపంచాన్ని తెలుసుకోవడానికి రెండే రెండు మార్గాలు. నేను డబ్బుకోసం పర్య

టించలేదు కాని ప్రపంచం ఎంత వర్ణమయంగా ఉంటోందో చందమామ నాకు చూపించింది. చందమామ కథలు నా జీవితమంతా ప్రేరణ కలిగిస్తూనే ఉన్నాయి. వ్యక్తిగా నేను చందమామ ద్వారానే విచక్షణా శక్తిని, స్వయం నియంత్రణను, మనోధైర్యాన్ని పొందాను. ఈ 2012 జనవరి సంచిక కూడా నన్ను నిజంగా ఆకర్షించింది.

ముప్పై ఏళ్ల తర్వాత కూడా, చందమామను నేను చదువుతూనే ఉన్నాను, నా పిల్లలకు చందమామ అంటే చాలా ఇష్టం. వాళ్లు ఇంగ్లీష్ మీడియం పాఠశాలలకు వెళుతున్నారు కాని కన్నడ చందమామను ఇప్పటికీ చదువుతున్నారు. దీనివల్ల వారు ఇంగ్లీషునుంచి కన్నడ లోకి, కన్నడ నుంచి ఇంగ్లీషు లోకి, హిందీ నుంచి ఇంగ్లీషులోకి కూడా అనువదించే కళను నేర్చుకున్నారు.

## చందమామతో నా జ్ఞాపకాలు - మరాఠీ

మా నాన్నే మాకు చందమామ చదివే అలవాటును నేర్పించారు. మా నాన్న మరో నగరంలో పని చేసేవాడు. ప్రతి శనివారం ప్రత్యేకించి ప్రతి నెలలో మొదటి శనివారం మా నాన్న రాకకోసం మేం వేచి ఉండేవాళ్లం. ఆ రోజే చందమామ మరాఠీ సంచిక మా ఇంటికి వచ్చేది. చందమామను ఎవరు ముందు చదవాలి అనే విషయంలో మేం ప్రతిసారీ గొడవపడేవాళ్లం. ఒక్కోసారి నాన్న వెళ్లి తీసుకోకముందే చందమామ సంచికలన్నీ అమ్ముడయిపోయేవి. ఆ నెలంతా మాకు పిచ్చిపట్టినట్లుండేది.


Name: Neelam Pandit,
Occ: Teacher, Warje,
Pune, Maharashtra.

చందమామ ప్రతులను సంవత్సరం వారీగా మా నాన్న బౌండ్ చేయించేవాడు. గత ముప్పై సంవత్సరాలుగా ఈ బౌండ్ పుస్తకాలను మేము మళ్లీ మళ్లీ చదువుతూనే వచ్చాము. కొన్నాళ్లకు చందమామ పేజీలు కొన్ని చిరిగిపోయేవి. ఒకరోజు వాటిని మేము పారవేయవలసి వచ్చింది. మా బాల్యాన్ని అలా మేం పోగొట్టుకున్నాము కూడా.

మా తదనంతర తరాలు కూడా చందమామను అదే ఆసక్తితో చదువుతూ వస్తున్నారు. మా సోదరిలలో ఒకరు మేనేజ్‌మెంట్ ప్రొఫెసర్. ఆమె బేతాళ కథలను కేస్ స్టడీస్‌గా ఉపయోగించేది. తన తార్కిక చింతనను, విశ్లేషణా పటిమను ఈ కథలు మెరుగుపర్చాయని ఆమె చెబుతుంది.

చందమామ నైతిక విలువలను బోధిస్తుందని మా స్నేహితురాలు చెప్పింది.

చందోబా(చందమామా) నీకు ధన్యవాదాలు.

## బేతాళ కథలు

# దేవుణ్ణి నమ్మనివాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగానే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు.

అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా! నువ్వు ఏమాశించి ఇంత కష్టసాధ్యమైన పనికి పూనుకున్నావో, ఏ నమ్మకం నిన్ను ఇటుగా నడిపిస్తోందో నాకు తెలియడం లేదు. కానీ ఈ నమ్మకాలన్నవి నూటికి నూరు శాతం శాశ్వతం కావు. కాకూడదు కూడా. నమ్మకాలు మార్చుకోలేనివాడు ఎక్కడున్నవాడు అక్కడే ఉండిపోతాడు. కాలానుగుణంగా, సమయానుకూలంగా తనని తాను మార్చుకున్న వాడు తర్వాతి కాలానికి ఆదర్శప్రాయుడవుతాడు. అది మంచికో, చెడుకో తర్వాతి విషయం. అలా తన నమ్మకాలనుమార్చుకున్న ఒక చక్రవర్తి కథచెబుతాను. శ్రమ తెలియకుండా విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.



పూర్వం కోసల సామ్రాజ్యాన్ని చంద్ర గుప్తుడనే చక్రవర్తి పరిపాలిస్తూ ఉండేవాడు. కోసల సామ్రాజ్యం ఎంత విశాలమైనదో అంత సంపన్నమైనది కూడా. సహజసంప దలు సమృద్ధిగా ఉన్న ప్రాంతం కావడమూ, ప్రజలంతా కష్టించి పనిచేసే తత్వం గల వారు కావడమూ చేత ఆ రాజ్యం దినదినా భివృద్ధి చెందుతూ ఉండేది.

అంత పచ్చగా ఉన్న సామ్రాజ్యం మీద, అక్కడి ప్రజలు సృష్టించుకున్న సంపద మీదా పొరుగు రాజ్యాల కన్ను ఉండటం, అలాంటి వాళ్లు శత్రువులుగా పరిణమిం చడం సహజం. తమ రాజ్యానికి ఎంత మంది శత్రువులు ఉంటారో తెలిసిన చంద్ర గుప్తుడు, రాజ్య పరిరక్షణ విషయంలో ఎప్పుడూ ఏమరుపాటుగా ఉండడు.

అందువల్లనే ఆ రాజ్యానికి పటిష్టమైన సైనిక వ్యవస్థ, లక్షల సంఖ్యలో సైన్యమూ ఉన్నారు. ఎప్పుడూ యువరక్తంతో సైన్యం ఉరకలేస్తూ ఉండేలా ఎప్పటికప్పుడు నవ యువకులని సైన్యంలో చేర్చుకోవడమూ, వాళ్లకి చక్కగా అన్ని విషయాల్లోనూ శిక్షణ ఇచ్చి సుశిక్షితులైన సైనికులుగా తయారు చేయడమూ జరుగుతూ ఉంటుంది.

నిజానికి, ఆ బలమైన సైనిక వ్యవస్థని చూసే, ఏ శత్రురాజ్యమూ కోసల రాజ్యం మీదికి దండెత్తే సాహసం చేయడం లేదు. అందువల్లనే చాలా ఏళ్లుగా ఆ రాజ్యం యుద్ధం ఎరుగదు. రోజులలా గడుస్తూ ఉండగా ఒకనాడు వేగులు వాళ్ళు తెచ్చిన సమాచారం కోసల సామ్రాజ్యం మొత్తాన్ని ఒక్కసారిగా వణికించింది.

విజయవర్ధనుడనే రాజు ఒకడు తన అపార సైన్యంతో విశాల భరతఖండం మొత్తాన్ని తమ పాదాక్రాంతం చేసుకోవాలనే ఏకైక లక్ష్యంతో ఒక్కో రాజ్యాన్ని జయించు కుంటూ ప్రస్తుతం కోసల రాజ్యం దిశగా సాగుతూ వస్తున్నాడని, ఇంతవరకూ అతని చేతిలో ఓటమి పాలయిన వాళ్లూ, యుద్ధం చేయకుండా లొంగిపోయిన వాళ్లూ తప్ప, అతనిపై గెలిచిన వాళ్లు ఒక్కరూ లేరనీ, వేగులు తెచ్చిన సమాచారం.

దాంతో రాజ్యమంతా అప్రమత్తమైంది. ముంచుకొస్తున్నది యుద్ధం గనుక, యుద్ధ ప్రాతిపదిక మీద సకల ముందు జాగ్రత్త చర్యలూ తీసుకోవడానికి సన్నాహాలు మొద లయ్యాయి.

మంత్రి మహాదేవుడు, సైన్యాధ్యక్షుడు వీరభద్రుడిని పిలిపించి, 'యుద్ధమేఘాలు కమ్ముకున్న ఈ తరుణంలో అన్నింటికన్నా ముఖ్యం క్షేత్రస్థాయిలో యుద్ధం చేసే సైనికులే. వాళ్లలో దేశభక్తినీ, శత్రువుని చీల్చి చెండాడి దేశాన్ని రక్షించుకోవాలనుకునే కసినీ, తపననీ, విజయమో, వీరస్వర్గమో తేల్చుకోవాలన్న తెగువని నింపాలి. ఆ ప్రయత్నాల్లో ఉండండి,' అన్నాడు.

'దేశభక్తి విషయంలో మన సైనికులకెవరూ సాటి రారు మంత్రి వర్యా, కాకపోతే ఎందుకో మన సైనికులు భీరువులయ్యారని అనిపిస్తోంది....'

సైన్యాధ్యక్షుడు చెప్పిన మాటలకి మంత్రి ఉలిక్కిపడ్డాడు. ఇలాంటి సమయంలో అలాంటి స్థితి ఎంత ప్రమాదం...

'అదేమిటి వీరభద్రా! సైన్యమంటే యుద్ధం వచ్చినప్పుడు బయటికి తీసి వాడుకునే వస్తువు కాదు. ఎప్పటికప్పుడు రేపే యుద్ధం అన్నంతగా సర్వసన్నద్ధమై ఉండాలి. అలాంటిది నిజంగా యుద్ధం ముంచుకొస్తున్న ఈ సమయంలో ఇలాంటి మాటలేమిటి?' అన్నాడు మంత్రి.

'క్షమించాలి... దానికి ఎలాంటి మాట వాడాలో తెలియని స్థితిలో ఆ పదం వాడాను తప్ప నిజంగా మన వాళ్లు భీరువులయ్యారని కాదు. విజయవర్ధనుడి విజయాలూ, పెద్ద పెద్ద రాజ్యాల అపజయాల వార్తలూ వాళ్లలో భయం పెంచాయనుకుంటాను. అలా అని వాళ్లు యుద్ధానికి వెళ్లకుండా పారిపోయే పిరికివాళ్లో, యుద్ధంలో తేలిగ్గా లొంగిపోయే బలహీనులో కాదు...'

'నిజమే, కానీ శత్రువుని గెలవాలంటే వాడి మీద ముందు మనసులో గెలవాలి.





తర్వాత నిజంగా వాడ్ని గెలవడం సులభం. అలాకాక, ముందు మానసికంగా ఓడిపోయినవాడు శత్రువుని ఎన్నటికీ గెలవలేడు.'

'అవును మంత్రివర్యా! కనుకే సైన్యంలో స్ఫూర్తిని నింపేలా ఎన్నో ఆలోచనలు చేస్తున్నాం. త్వరలోనే మంచి వార్తతో మీ ముందుంటాను,' అన్నాడు వీరభద్రుడు సెలవు తీసుకుంటూ.

ఇది జరిగిన నెల రోజుల తర్వాత వీరభద్రుడు మంత్రి మహాదేవుడిని కలిసాడు.

'ఏమైంది? ఎంతదాకా వచ్చాయి మీ ప్రయత్నాలు?' అడిగాడు మంత్రి వీరభద్రుడిని.

'సఫలం అయ్యాయి మంత్రివర్యా!'

'శుభం. ఎలా సాధించారు?' ఉత్సుకతతో ప్రశ్నించాడు మంత్రి.

'జెండాపై కపిరాజు విజయానికి చిహ్నం కదా మంత్రివర్యా! భారత యుద్ధంలో విజయుడికి విజయాన్నందించిన ఆ పతాకం వెంట ఉంటే విజయలక్ష్మి మననే వరిస్తుందని జ్యోతిష బ్రహ్మ విశ్వనాథశాస్త్రి గారు చెప్పారని చెప్పి సైన్యంలో ఉత్సాహం నింపాను. ఇప్పుడా జెండాల సాక్షిగా మన సైన్యం నిత్యం యుద్ధకళలని రెట్టించిన ఉత్సాహంతో సాధన చేస్తున్నారు. ఎప్పుడంటే అప్పుడు వాళ్లు సర్వం సిద్ధం. కానీ..'

'ఊ... కానీ...? ఇంకా ఈ కానీ ఏమిటి?' ఒకింత కోపంగానే అన్నాడు మంత్రి.

'సైన్యంలో ఆశించిన ఫలితం అయితే వచ్చింది కానీ, ఆ పని ఎంత ఆనాలోచితంగా చేశానో నాకు రాజధానిలో అడుగు పెట్టాకే అర్థమైంది,' అని కలవరపడుతూ అన్నాడు సైన్యాధ్యక్షుడు.

'ఏమైంది..?'

'నా భయం అంతా మన ప్రభువుల గురించే. పరమ నాస్తికుడైన ప్రభువులు రేపు యుద్ధరంగంలో దైవ సంబంధమైన చిహ్నాలను అనుమతించకపోతే...'

మధ్యలోనే ఆపేసినా వీరభద్రుడి మాటల అంతర్యమేమిటో పూర్తిగా అర్థమైంది మంత్రికి.

ఎందుకంటే చంద్రగుప్తుడు నాస్తికుడు.

'దేవుడు కావచ్చు, మరొకటి కావచ్చు... కంటికి కనిపించని వాటిమీద నమ్మకాలు పెట్టుకున్నవాడు బలహీనుడవుతాడు. స్వశక్తిని నమ్ముకున్నవాడు మరింత శక్తి

మంతుడవుతాడు,' అంటాడు ఆయన.

తన అభిప్రాయాలు ప్రజలమీద రుద్ద కుండా, ఎవరి నమ్మకాలు వాళ్లవని వదిలే సినా, రాజరిక వ్యవహారాల్లోనూ, పరిపాలనా సంబంధ విషయాల్లోనూ అంతా ఆయన అభీష్టం మేరకే జరుగుతూ ఉంటుంది. దానివల్లనే ఎక్కడా దైవ ప్రసక్తిగానీ, ఎలాంటి చిహ్నాలు కానీ అంతఃపురంలోనూ ప్రభు త్వానికి సంబంధించిన విషయాల్లోనూ ఎక్కడా కనిపించవు.

'ఎలాంటి సంకట స్థితిలో పడ్డాం మనం. విడవమంటే పాముకు కోపం, కరవమంటే కప్పకి కోపం అన్న సామెతలా ఉంది పరి స్థితి. సరే.. ఎలా జరిగేది అలా జరుగు తుంది. అయినా మన చేతుల్లో ఏముంది.. సకల గుణాల రాశీ, ప్రజల్ని కన్నబిడ్డల్లా చూసుకునే ఈ మహావీరుడైన ప్రభువు దేవుడిని నమ్మని నాస్తికుడవటం దైవలీల కాక మరేమిటి... మీరు వెళ్ళి మీ ఏర్పా ట్లలో మీరు ఉండండి. ఆ పైన పైవాడి దయ..' అన్నాడు మంత్రి.

తర్వాత చాలా కొద్ది రోజులకే విజయ వర్ధనుడు కోసల రాజ్యం దిశగా మరింత ముందుకు చొచ్చుకు వస్తున్నాడని వేగుల సమాచారం వచ్చింది.

చంద్రగుప్తుడి నేతృత్వంలో అత్యవసర సమావేశం ఏర్పాటు చేయబడింది. కోసల రాజ్యపు సరిహద్దులలో కాపు కాసి విజయ వర్ధనుడిని అక్కడే ఎదుర్కొని రాజ్యంలో కాలు మోపనివ్వకుండా అడ్డుకోవాలనేది యుద్ధ వ్యూహంగా ఎంచబడింది.



సైన్యాన్ని సర్వసన్నద్ధంగా ఉంచాలని వీరభద్రుడిని ఆదేశించాడు చంద్రగుప్తుడు.

ఇక సంశయిస్తే లాభం లేదని విషయం చంద్రగుప్తుడికి వివరించాడు మంత్రి సహ దేవుడు.

అంతా విని చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు చంద్రగుప్తుడు. గంభీ రంగా మారిపోయిన ఆయన మోహం చూస్తూ అంతా ఉత్కంఠతో ఊపిరి బిగపట్టి చూడసాగాడు.

చాలా సేపటి తర్వాత ఒక నిర్ణయానికి వచ్చినట్లు తల పంకించిన చంద్రగుప్తుడు పతాకాలు వెంట తెచ్చుకునేందుకు వీర భద్రుడికి అనుమతినిచ్చాడు.

అంతవరకూ కథ చెప్పిన బేతాళుడు 'రాజా, స్వశక్తినే నమ్ముకున్న చంద్రగు

ప్తుడు, అంతకాలం నాస్తికుడిగా గడిపిన వాడు, దేవుడిని నమ్మనివాడు అకస్మాత్తుగా తన నమ్మకాన్ని ఎందుకు సడలించుకున్నాడు. తన నిర్ణయాలు ఎందుకు మార్చుకున్నాడు? హాయిగా ఉన్నప్పుడు దేవుడిని తిట్టి, కష్టాలు ముంచుకురాగానే దేవుడా నీవే దిక్కనే చాలామందిలాగా అతను కపటనాస్తికుడా? పైకి దేవుడు అక్కర్లేదనేంత ధైర్యవంతుడిగా నటించే భయస్తుడా? ఈ ప్రశ్నలకి సమాధానాలు తెలిసీ చెప్పకపోయావో నీ తల వేయి ముక్కలవుతుంది' అన్నాడు.

అందుకు విక్రమార్కుడు సమాధానమిస్తూ, 'చంద్రగుప్తుడు భయస్తుడు కాడు. బలహీనుడు కాడు. వ్యక్తిగా అతను పరిపూర్ణుడు. అందుకే దైవాన్ని కాదని స్వశక్తిని నమ్ముకున్నాడు. అదే సమయంలో ప్రజల మీద తన నమ్మకాలు రుద్దకుండా వాళ్ల నమ్మకాల్ని గౌరవించాడు. అంటే దేవుడిని నమ్మకపోవడం అన్నది పూర్తిగా తన వ్యక్తిగతమైన అభిప్రాయం అని అతడు చెప్పకనే చెప్పాడు. అలాంటి వాడు సైనికుల నమ్మకాన్ని గౌరవించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

అదీగాక యుద్ధం అన్నది అతడి వ్యక్తిగతమైన వ్యవహారం కాదు. మొత్తం రాజ్యానికీ, ప్రజలకీ సంబంధించిన విషయం. అలాంటి చోట సైనికుల మానసిక స్థైర్యానికి సంబంధించిన విషయంతో తన నమ్మకాన్ని సడలించుకోవడంలో ఎంత విజ్ఞత చూపాడతను.

నాస్తికుడైన మహారాజే దాన్ని నమ్మాడంటే అందులో మహిమ ఉన్నదని మరింత నమ్మకంతో, రెట్టించిన ఉత్సాహంతో యుద్ధంలో పాల్గొన్న సైన్యం విజయంతో తిరిగి వచ్చిందనడంలో కూడా ఎలాంటి అతిశయోక్తి ఉండదు..,' అని చెప్పాడు.

రాజుకు ఆ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. – కల్పితం

(ఆధారం: పైడికొండల వెంకటేశ్వరరావు)





# చేపల పంట

కైరోనగరంలో గోహా అనే ప్రసిద్ధ హాస్యగాడు ఒకాయన ఉండేవాడు. ఆయనకు ఒకప్పుడు తోటపనిమీద ఆసక్తి కలిగింది. అందుచేత ఆయన తన పెరడు యావత్తూ తవ్వి, రకరకాల పూలమొక్కలు నాటి పాదులు పెట్టి, ఎరువు వేసి, శ్రద్ధగా పెంచసాగాడు.

తోటపనిలో గోహాకు కలిగిన ఆసక్తి గమనించి ఆయనకు అనేకమంది మిత్రులు సలహాలిచ్చారు. చేతనయినవారు సాయం చేశారు. కొద్ది కాలంలోనే గోహా తన పెరడులో అందమైన పూలు పూయించసాగాడు.

ఒకనాడు ఒక సంపన్నుడు గోహాను చూడడానికి వచ్చాడు. ఆ సమయానికి గోహా పూల తోటలో కలుపు తీస్తూ కనిపించాడు.

‘ఇటీవల నువు గొప్ప తోటమాలివి అయ్యావని విన్నాను. కాని నీ తోటలో కొత్త రకం మొక్కలేమీ ఉన్నట్లు లేదే?’ అన్నాడు సంపన్నుడు.

‘దొరికిన విత్తనమల్లా వేసి చూస్తూనే ఉన్నాను. కొత్తమొక్కలు లేకపోతే అది నా తప్పు కాదు,’ అన్నాడు గోహా.

‘కొత్త విత్తనాలు కావాలంటే నేనే ఇస్తాను గాని, వాటిని మొలిపించడం నీవల్ల కాదేమోనని నా అనుమానం,’ అన్నాడు సంపన్నుడు.

‘అటువంటి భయమేమీ వద్దు. నేను ఎలాంటి విత్తనాలనైనా మొలిపిస్తాను,’ అన్నాడు గోహా.

‘అయితే రేపు ఉదయం మా నౌకరు చేత విత్తనాలు పంపుతాను. వాటిని మా అల్లుడు బాగ్దాదు నుంచి ఇటీవల పంపాడు.

వై.ఆదినారాయణ



నాకు తోటపని మీద ఆసక్తి లేక వాటిని అలాగే పొట్లం కట్టిపెట్టాను.' అన్నాడు సంపన్నుడు నర్మగర్భంగా నవ్వుతూ.

మర్నాడు ఉదయం సంపన్నుడి నౌకరు వచ్చి గోహాకు ఒక పొట్లం ఇచ్చి, 'అయ్యా! దీనిని మా యజమాని మీకిమ్మన్నారు. వీటిని ఎంతో జాగ్రత్తగా మొలకెత్తించమన్నారు,' అని చెప్పాడు.

గోహా పొట్లాన్ని విప్పి, 'ఇవి ఏ బాపతు విత్తనాలో మీ యజమాని చెప్పాడా?' అని నౌకరును అడిగాడు.

'వాటి గురించి ఆయనకే తెలియదట. మొక్కలు పెరిగాక ఆయన వచ్చి చూస్తానని చెప్పమన్నారు,' అని చెప్పి నౌకరు వెళ్లిపోయాడు.

తోటపని చేసేవారు సాధారణంగా తమకు తెలియని విత్తనాలు కనిపించినప్పుడు ఒకటి నోట్లో వేసుకుని, మునిపంట కొరికి రుచి చూస్తారు. గోహా కూడా ఆ పనే చేసి సంపన్నుడు తనకు చేసిన మోసం గుర్తించాడు.

అవి విత్తనాలు కావు. ఎండబెట్టిన చేప గుడ్లు. తనను పది మందిలో వేళాకోళం చెయ్యడానికే సంపన్నుడు వాటిని తోటలో నాటమని పంపించాడు. దీనికి ఏదో ఒక విధంగా ప్రతిక్రియ చేయాలని గోహా నిశ్చయించుకున్నాడు.

రెండు వారాలు గడిచింది. గోహా బజారుకు వెళ్ళిన సమయంలో సంపన్నుడు ఎదురుపడి, "ఏం గోహా? గులాబీలు కులాసాయేనా?' అన్నాడు.

'మీ దయవల్ల ఈ యేడు అవి ఆకు కనపడకుండా పూశాయి!' అన్నాడు గోహా.

'అన్నట్లు నేను పంపిన విత్తనాలు నాటావా?' అన్నాడు సంపన్నుడు.

'అప్పుడే నాటానే!' అన్నాడు గోహా ఏ మాత్రం తడుముకోకుండా.

'సంపన్నుడు బలవంతాన నవ్వు ఆపుకుంటూ, 'బహుశా మొలకెత్తి ఉండవు. వాటిని మొలకెత్తించడం మామూలు తోటమాలులకు సాధ్యమయే పని కాదని మా అల్లుడు కూడా అన్నాడులే!' అన్నాడు.

'ఆ పప్పులు మన దగ్గర ఉడకవు. చెయ్యవలసినట్లు పాదు చేసి, వెయ్యవలసిన ఎరువు వేసి విత్తులు నాటి జాగ్రత్తగా కాపాడితే, ఏ విత్తనాలైనా మొలుస్తాయి. మీరు

పంపిన విత్తనాలు ఇప్పుడిప్పుడే మొలకలె త్తుతున్నాయి. వాటికి దిష్టి, ఎండా తగల రాదు. అందుచేత పిడతలు కప్పి ఉంచాను. రేపు ఉదయం మా యింటికి దయచె య్యండి చూద్దురు గాని!' అన్నాడు గోహా.

సంపన్నుడు వెలవెలబోతూ 'అలాగే వస్తాను!' అని తన దారిన వెళ్లాడు.

గోహా చేపల దుకాణానికి వెళ్లి ఒక పావు శేరు చిన్న చేపలు కొని ఇంటికి పట్టు కెళ్లాడు. ఆయన తన చిన్న కొడుకును పిలిచి, 'ఒరే, ఈ చేపలను మూతులు పైకి కనబడేటట్టుగా మన పెరడులో ఒక బార దూరాన సగం సగానికి పాతిపెట్టి, వాటిపైన పిడతలు మూసిపెట్టు,' అన్నాడు. గోహా కొడుకు అలాగే చేశాడు.

మరుసటి రోజు ఉదయం సంపన్నుడు వచ్చాడు. గోహా ఆయనను వెంటబెట్టుకు పోయి పిడతలు చూపించి, 'మొక్కలు వాటి కింద ఉన్నాయి,' అంటూ ఒక పిడత ఎత్తి చూపాడు. నేలలోనుంచి మొలుచుకు వస్తున్నట్లుగా చేప ఒకటి కనపడింది.

గోహా పిడతలన్నీ ఎత్తి చూపినాక సంప న్నుడికి తల తిరిగినట్లయింది. 'ఆశ్చర్యం! అద్భుతం! నిన్న కూడా నీ మాటలు నేను నమ్మలేదు. ఇప్పుడైనా నా కళ్లతో ప్రత్యక్షంగా చూశాను గనక నమ్ముతున్నాను గాని లేక పోతే నమ్మను!' అన్నాడు.

'ఈ విత్తనాలు మొలిపించడం ఏమీ కష్టం కాదు. నాకే పది ఎకరాలుంటే పంట పండించేద్దును!' అన్నాడు.

'ఆ పని నేనే చేస్తాను!' అంటూ సంప న్నుడు ఇంటికి వెళ్లి తన పొలాలు చేసేవా రిని పిలిచి, 'ఒరే, మీరు ఈ యేడు మన పొలాలలో ఎండిన చేపగుడ్లు చల్లండి!' అన్నాడు. వాళ్లు అలాగే చేశారు.

గోహా ఈ వార్తను నగరమంతటా చెప్పే శాడు. అందరూ సంపన్నుణ్ణి చూసి నవ్వ సాగారు. గోహాను పరాభవం చెయ్యబో యినందుకు తనకు ప్రాయశ్చిత్తం బాగా జరిగిందని సంపన్నుడు తెలుసుకున్నాడు.





# అనంతుని అహంకారం

పూర్వం ఈశ్వరపురం అనే గ్రామంలో అనంతుడనే మోతుబరి రైతు ఉండేవాడు. తండ్రి ఇచ్చిపోయిన పది ఎకరాలనూ పాతికకు పెంచి, పండ్లతోటలూ, వరి, పప్పుధాన్యాలతో పాటుగా కూరపాదులూ తృణధాన్యాలూ సాగుచేస్తూ మంచి రైతుగా గ్రామంలో గుర్తింపు పొందాడు. అందరూ మెచ్చుకోడంతో అతడిలో కాస్త గర్వం, అతిశయం పెరగ సాగాయి.

గ్రామంలోని రైతులంతా రాత్రి భోజనాలయ్యాక ఊరి నడిబొడ్డున ఉన్న రచ్చబండ వద్ద చేరేవారు, గ్రామపెద్దతో తమ సాధకబాధకాలు చెప్పుకునేవారు. ఆయన ఏదైనా పరిష్కారం సూచించేవాడు. ఒక రోజురాత్రి అనంతుడు రచ్చబండవద్దకెళ్ళే సరికి అంతా సునందుని ఓదార్చడం చూసి 'ఏమైంది?' అని అడిగాడు.

దానికి దానయ్య అనే ఇంకొక రైతు 'అనంతా! ఈరోజు సునందుని సంతలో మోటయ్య అనేటోకు వ్యాపారి మోసం చేశాడు.' అని చెప్పగానే, అనంతుడు నవ్వి 'వ్యాపారం, వ్యవసాయం అంత సులువైనవి కావు, తెలివితేటలు, అనుభవం లేకుంటే ఎవరైనా సులువుగా మోసంచేస్తారు' అనడంతో గ్రామపెద్దతో సహా అంతా అనంతుని తొందరపాటుకు నొచ్చుకున్నారు.

అసలే బాధలో ఉన్న సునందు ముఖం చిన్నబోవడం కూడా అంతా గమనించారు. గ్రామపెద్ద 'కేవలం అనుభవం తెలివితేటలూ మాత్రమే చాలవు అనంతా! ఒక్కోమారు ఎంత తెలివైనవారైనా మోసపోడం ఖాయం' అన్నాడు.

దానికి అనంతుడు, 'నేను మీ మాట అంగీకరించను. తెలివితేటలుంటే ఎంత

ఆదూరి హైమవతి

మోసాన్నయినా తప్పించుకోవచ్చు. చూడండి నేనెన్నడూ మోసపోలేదు సంతలో' అన డంతో, బాధలో ఉన్న సునందు 'ఐతే నీవు చాలా తెలివైన వాడినంటావ్?' అని అడి గాడు. 'ముమ్మాటికీ! నేనెన్నడూ ఎవరిచేతా మోసపోలేదు, పోను కూడా. ఎందుకంటే ప్రతిపనీ బాగా ఆలోచించి చేస్తాను గనుక' అని ధీమాగా చెప్పాడు అనంతుడు.

దానికి సునందు 'నీవు ఎప్పుడైనా ఎవరి వల్లనైనా మోసపోతే నేను ఇరవై వేల వరహాలి స్తాను, నీవు మోసపోకపోతే ఏంపందెమో చెప్పు.' అనగా, గ్రామపెద్ద కలుగజేసుకుని 'ఊరంతటికీ తెలివైనవాడినంటున్న అనం తుడు మోసపోతే సునందుకు నలభై వేల వరహాలు ఇవ్వాల్సి ఉంటుంది .ఈ పందెం మూడు మాసాల వరకూ మాత్రమే! దీనికి మేమంతా సాక్ష్యం ఏమంటావు అనంతా! నీకు సమ్మతమేనా?' అన్నాడు సవాలుగా. అనం తుడు 'అలాగే నేను మోసపోవడమంటూ జరగదు, ఉత్త పుణ్యానికి సునందు మరో ఇరవైవేల వరహాలు పోగొట్టుకుంటాడనే నాబాధ' అన్నాడు వేళకోళంగా.

జరిగిందేమంటే సునందు మంచి మన సున్నవాడు. మామిడి కాయలు అంతా ముందే దింపించి పొగబెట్టి పండించి సంతలో ముందుగానే టోకు ధరకు అమ్మి సొమ్ము చేసేసుకుంటారు. సునందు మాత్రం చెట్లకే పండ్లను ఉంచి పక్వానికి వచ్చాక దింపించి అమ్ముతాడు, కొనితినే వారు ఆనందపడాలనీ ఆ ఆనందమే అమ్మి నవాడికీ పండించినవానికీ ఆశీర్వచనమని



భావించేవాడు. ఊరివారంతా పండ్లను దింపించాక వారానికి తాను దింపించి అమ్మే వాడు.ఈ మారూ అలాగే పది మామిడి పండ్ల బండ్లతో వెళ్ళాడు సంతకు. మంచి రంగు రుచిగల మేలు రకం పండ్లు గనుక మంచి రేటు వస్తే తన పెళ్ళికి ఎదిగిన కూతురు రుక్మిణికి నగలు చేయించి, శ్రావణమాసంలో వివాహం జరిపించాలని సునందు ఆలోచన.

సంతకెళ్ళగానే ముందుగా మోటన్న కనిపించాడు. ప్రతిఏడాదీ తనవద్ద బేరం చేసే బయ్యన్న కోసం వెతికి ఎండెక్కిపోతు న్నందున మోటన్నతోబేరం కుదుర్చుకు న్నాడు సునందు. ఐతే మోటన్న మోసగాడు, 'సునందూ! నీవు మూడురోజులు ఆల స్యంగా వచ్చావు, ఈరోజు అంత వెలలేదు



ఏంచేద్దాం చెప్పు, నీకోసమని వందకు మూడు వరహాలు తగ్గించి తీసుకుంటాను, లేదా నీవు రేపటి వరకూ ఆగు, రేపటి రేటు ఎక్కువ అయితే ఆరేటుకే కొంటాను' అని చెప్పగానే, సునందు 'రేపటివరకూ ఎక్కడుంటాను, పళ్ళు బాగా మాగాయి, రేపటికి పాడౌతాయేమో! ఎలాగో తీసేసుకో, పొద్దుండగానే గ్రామానికి వెళతాను' అని తన పది బళ్ళ మామిడి పళ్ళూ మోటన్న అడిగిన వెలకంటే మూడు వరహాలు తక్కువకు ఇచ్చేసి వచ్చాడు, తాను ఆశించిన ధర రానందుకు చాలా బాధపడుతూ ఇల్లుచేరాడు.

ఆసాయంకాలం సునందు బావమరది బంగారయ్య, బావగార్నీ, చెల్లెల్ని తన చెల్లాయి పెళ్ళికి ఆహ్వానించాలని వస్తూ ఓ బుట్టెడు మామిడి పళ్ళు తెచ్చాడు. సునందు మామిడిపళ్ళు చూసి ఆశ్చర్యంగా 'బంగారూ! ఇవి నా తోటలో పళ్ళు? నీకెక్కడివీ?' అనగా బంగారయ్య 'పిల్లలున్న ఇంటికివస్తూ ఉత్తి చేతులతో రాలేక సంతలో కొన్నాను బావా! వంద ఇరవై వరహాలు, చాలా బావున్నయ్ కదూ!' అనగానే సునందుకు తానెంత మోసపోయిందీ అర్థమైంది. ఆ విషయమే ఆరోజు రచ్చబండవద్ద గ్రామస్తులందరితో చెప్పుకున్నాడు సునందు.

ఇది జరిగిన మండలం రోజులకు అనంతుడు ఓరోజున ఉదయాన్నే తన గిత్తల గూడు బండిలో తోటల్లోంచీ వెళుతుండగా గ్రామపెద్ద ఎదురై 'ఏం అనంతూ! ఎక్కడికో ప్రయాణంలాగుంది, కుటుంబంతో!' అని ప్రశ్నించాడు. 'ఔను! మా తమ్ముడి కొడుకు నామకరణానికి వెళ్తున్నాం, పదిరోజులు మకాం' అన్నాడు బండి ఆపి.

'మరి ఇంటినిండా వరి బస్తాలు వేశావాయె, ఏంఫరవాలేదా?'

'బాగానే జాగ్రత్తచేశాను, పాలేర్లను కాపలా ఉంచాను, మాఇంటి పెంపుడు కుక్కలు రోజంతా కాపలా కాస్తూ, చీమ చిటుక్కు మన్నా చీల్చేస్తాయి.'

'మరి పప్పుధాన్యాలూ గాదెల్లో పెట్టావు కదా?'

ఫరవాలేదు, ఆగాదెలపైన పేడ అలికించి మా ఆవుల్ని కట్టేశాను, మాపాలెగాళ్ళు వాటి ఆలనాపాలనా చూస్తారు.

'మరి మామిడిపళ్ళూ, తృణ ధాన్యాలూ అమ్మిన సొమ్ము చాలానే ఉండాలి కదా.

ఏదో పొలం బేరమాడుతున్నవాయె!'

'దానికీ తగుజాగ్రత్త చేశానులే! సొమ్ము దాచిన బానను దేవుని మూలగదిలోంచి తీసి కూటి కుండల మధ్య దాచాను, ఏ దొంగా తెల్సుకోలేడులే, వస్తానయ్యా! పొద్దెక్కే వేళకు ఊరు చేరాలి' అంటూ బండి సాగించాడు.

పదిరోజులయ్యాక దంపతులు ఇల్లు చేరారు. అనంతుడి భార్య, వంట కోసం కూటికుండలు సవరించగా అన్నీ ఓటు బోసి ఉన్నాయి, వాటి అడుగున ఉంచిన సొమ్మున్నబాన మాత్రం కన్పించనే లేదు అనంతుకు ఎంత వెతికినా.

అనుమానంవచ్చి ఆవులను కట్టేసిన చోట ఉన్న గాదెలను త్రవ్వి చూడగా అవీ ఖాళీగా ఉండటం చూసి బేజారెత్తింది అనంతుకు. వరిధాన్యం బస్తాలలో వరికి బదులు చెత్త చెదారం ఉంది.

గుండెలను బాదుకుంటూ గ్రామపెద్ద వద్దకెళ్ళి చెప్పుకున్నాడు 'మీరేన్యాయం చేయాలి ఆరోజు ఊరెళుతున్నట్లు మీకే చెప్పాను, బహుశా ఇది సునందుపనే అయి ఉంటుంది, నన్ను దెబ్బతీయాలని ఈ దొంగ తనం చేయించి ఉంటాడు' అని చెప్పాడు.

గ్రామపెద్ద ఆర్రాత్రి అందరినీ పిలిపించి 'ఈ అనంతు ఊరు వెళుతూ ఏవేవి ఎక్కడ దాచింది నాకుచెప్పాడు. తెలివైనవారు ఇలా దాచిన ప్రదేశాలు చెప్తారా? ఇపుడు ఈ దొంగతనం, సునందు మీదవేయటం ఏంబా వుంది? తోటల్లో ఎంతోమంది పని చేస్తుం టారు, ఎవరైనా నీగుట్టులన్నీ వినిచేయవ చ్చుకదా? నిజానికి సునందు పక్షం రోజు లుగా తన బావమరది ఇంట జరిగే పెళ్ళికి వెళ్ళి ఉన్నాడు.

మోసపోకుండా ఉండటానికి తెలివి ఒక్కటే చాలదు, అనుభవమూ చాలదు. ఒక్కో సమయంలో ఎంతతెలివైన వారైనా మోసపోతారు. నీవే దానికి ఉదాహరణ. భయపడకు, నీ సొమ్మంతా భద్రంగా నాయింటనే ఉంది. వెళ్ళి తెచ్చుకోపో. ఎవ రినీ తక్కువచేయటం తగదు.' అని మంద లించాడు. సిగ్గుతో తలదించుకున్నాడు అనంతుడు.





# పంచతంత్ర కథలు

దక్షిణ దేశంలో మహిళారూప్య నగరం సమీపంలో ఉండిన మహారణ్యంలో ఒక విశాలమైన వటవృక్షం ఉండేది. దాని మీద ఉండిన అసంఖ్యాకమైన పళ్లను వేలాది పక్షులు తినేవి. దాని నీడ కింద ఎంతమంది బాటసారులైనా విశ్రమించటానికి చోటు ఉండేది. దాని ఊడలు ఎంతో మేర దిగాయి. దాని ఆకుల మధ్య ఎన్నో రకాల పక్షులు గూళ్ళు కట్టుకున్నాయి. దాని కొమ్మల మీద అనేక కోతుల సమూహాలు నివసించేవి. దాని పూల తేనెలను అంతు లేని తేనెటీగలు పట్టుకుపోయేవి.

ఆ మహావృక్షం మీద లఘుపతనకం అనే కాకి నివసిస్తూ ఉండేది. ఒకనాడు అది ఆహారం కోసం మహిళారూప్య నగరం కేసి పోతూ ఒక బోయవాణ్ణి చూసింది. వాడు నల్లగానూ, క్రూరంగానూ ఉన్నాడు. వాడి చేతిలో వల ఉన్నది. వాణ్ణి చూసి కాకి, 'ఈ దుర్మార్గుడు నేనుండే వటవృక్షం వైపే పోతు న్నాడు. అక్కడ వాడు తప్పక పక్షులను పట్టుతాడు. పాపం, వాటిగతి ఏమి కాను న్నదీ తెలియదు. ఏమైనా నేను వాటిని కాపాడాలి,' అనుకున్నది.

ఇలా అనుకుని ఆ కాకి వెనక్కు తిరిగి వెళ్లి, పక్షులన్నిటితోనూ ఇలా చెప్పింది:

'వలా, బియ్యపు గింజలూ తీసుకుని ఒక బోయవాడు ఇటుగా వస్తున్నాడు. మీరు ఆ దుర్మార్గుణ్ణి గాని, వాడు వేసే బియ్యాన్ని గాని నమ్మకండి. వాడు వల వేసి బియ్యం చల్లుతాడు. ఆ బియ్యాన్ని మీరం దరూ విషం కింద భావించి వర్జించండి.'

బోయవాడు వటవృక్షం వద్దకు వచ్చి,

మిత్ర సంప్రాప్తి - 1

వల పరిచి, బియ్యం గింజలు చల్లాడు. తరువాత వాడు కొంతదూరం వెళ్ళి ఒక చోట దాగి, వలవేసి చూడసాగాడు. కాకి ముందు గానే హెచ్చరించి ఉడటం చేత పక్షులన్నీ రహస్యంగా దాక్కున్నాయి.

కాని కొద్ది సేపటికల్లా చిత్రగ్రీవమనే పావురాల రాజు, తన వెయ్యిమంది అను చరులతో సహా, ఆహారం వెతుకుతూ అటుగా వచ్చింది. దూరాన ఉండగానే వాటికి బియ్యపు గింజలు కనపడ్డాయి. అవి వాటికేసి ఎగురుతూ ఉన్నాయి. కాకి వాటికి ప్రమాదం గురించి హెచ్చరికచేసింది. కాని లాభం లేకపోయింది.

జిహ్వ చాపల్యంతో పావురాలన్నీ బియ్యపు గింజల పైన వాలి, వలలో చిక్కుకుపోయాయి. అజ్ఞానంలో ఉంటూ, జిహ్వ చాపల్యానికి గురి అయే ప్రాణులు, చేపలలాగా ఆకస్మిక మరణానికి గురికా వటం తప్పదు కదా! అంతమాత్రాన పావు రాలను తప్పుపట్టనవసరం లేదు. మానవ జాతికి దురాశ సహజమే గద! లేకపోతే, రావణుడి వంటి దైవభక్తుడు ఇతరుడి భార్యను అపహరించటం పాపమని ఎందుకు గ్రహించకపోవాలి? దైవస్వరూ పుడైన రాముడికి బంగారు లేడి అసంభ వమనీ, అది మాయ అనీ ఎందుకు తెలి యకపోవాలీ? ధర్మపరుడైన యుధిష్ఠరుడు పాచికలాడి ఆకస్మికంగా తన సర్వస్వమూ ఎందుకు పోగొట్టుకోవాలీ?



తన మనస్సును ఏదైతే ఆకర్షిస్తుందో దాని వెనక దాగి ఉండే ప్రమాదాన్ని మనిషి గుర్తించలేక పోతాడనుకోవాలి. లేదంటే అపాయం కలగటం తప్పనిసరి అయిన క్షణంలో విధినిర్ణయం వల్ల మేధావంతు లకు కూడా బుద్ధి పెడతల పట్టుతుందని అనుకోవాలి.

పావురాలు తన వలలో చిక్కుకుపోయా యని బోయవాడికి తెలిసింది.

బోయవాడు పన్నిన ఉచ్చులలో తన అనుచరులందరూ చిక్కుకుపోయిన సంగతి గ్రహించి, చిత్రగ్రీవం వాటితో ఇలా అన్నది.

'విచారించి కుంగిపోకండి. ఆపదలో మనసును చిక్కబట్టుకున్న వాడు ఆ ఆప

దను దాటగలుగుతాడు. బోయవాడు వచ్చేలోపున మనమందరమూ ఒకేసారి గాలిలోకి ఎగిరి, వలతో సహా ఆ దుర్మార్గుడికి కనబడకుండా వెళ్లిపోదాం. అలా అయితేనే మనం బతికిపోతాం. అలాకాక మనం నిరాశ చెంది, కుంగిపోయి, తలా ఒక దిక్కుకూ ఎగిరినట్లయితే మన అందరికీ, రెండు తలల పక్షి కథలోలాగ ప్రమాదం తప్పదు.'

రెండు తలల పక్షి కథ

(ఒకప్పుడు రెండు తలల పక్షి ఒకటి ఉండేది. ఆ తలలు విరుద్ధ దిక్కులుగా ఉండేవి. ఒకనాడు దాని ఒక నోటికి అమృతమందింది. రెండో నోరు తనకు కూడా అమృతంలో భాగం ఇయ్యమన్నది. దానికి మొదటి నోరు ఒప్పుకోలేదు. అందుకని రెండో నోరు విషం కోసం వెతికి తిన్నది. ఆ విషం పక్షినీ, దాని రెండు తలలనూ కూడా చంపేసింది.)

పావురాల రాజైన చిత్రగ్రీవం ఈ విధంగా హెచ్చరించిన మీదట పక్షులన్నీ ఒక్కసారిగా, వలతో సహా ఎగిరాయి.

బోయవాడు వాటి వెంబడి నేలమీద పరిగెత్తుతూ 'ఆ పక్షులు త్వరలోనే తమలో తాము కీచులాడుకోక మానవు. అప్పుడు అవి తప్పక నా వలతో సహా కింద పడతాయి,' అనుకున్నాడు.

లఘుపతనకం (కాకి) ఆహారం కోసం వెతకటం కూడా మాని, వల వెనుకగా తాను కూడా ఎగురుతూ వెళ్లింది.

త్వరలోనే పావురాలు వలతో సహా బోయవాడికి కనబడనంత దూరం వెళ్ళిపోయాయి. వాడు నిరాశ చేసుకుని, 'రాసి పెట్టలేనిది జరగదు. రాసిపెట్టి ఉన్నది ప్రయత్నం అవసరం లేకుండా దానంతట అదే జరుగుతుంది. నా కుటుంబానికి జీవనాధారంగా ఉండిన వల కూడా పోయింది,' అనుకుని వెనక్కు మళ్లాడు. (ఇంకా వుంది)





# స్వర్గం - నరకం

కౌముదీ రాజ్యమహారాజు రవివర్మకు ఒక రోజు వింత సందేహం కలిగింది. తాను మర ణించినాక స్వర్గానికి వెళతానా, నరకానికెళ తానా అన్నదే ఆ అనుమానం. మనస్సును పురుగులా తొలిచేయడంతో రాజుకు కడు పారా అన్నం, సుఖంగా నిద్ర కరువైనాయి.

ఒకరోజు మంత్రులు, ఆస్థాన పండితు లతో అత్యవసర సమావేశం నిర్వహించాడు. సభను ఉద్దేశించి రవివర్మ 'ప్రజల సంతో షమే నా సంతోషంగా భావిస్తున్నాను. కానీ నాకు తెలియకుండానే ఏమైనా దుర్మార్గాలు చేశానేమో అంతుపట్టడం లేదు. శిస్తువ సూలు కోసం కఠిన చర్యలు తీసుకోవడం తప్ప నేను ఎవ్వరినుండి కూడా అన్యాక్రాం తంగా తీసుకోలేదు. మీరేమంటారు?' అన్నాడు.

మహామంత్రి వర్ధనుడు జోక్యం చేసు కుని, 'మీ పరిపాలనలో ప్రజలంతా సుఖ సంతోషాలలో ఓలలాడుతున్నారు. మీ పాలనను దుయ్యబట్టేవారు ఇంతవరకూ ముందుకు రాలేదు. మనదేశం అన్ని రంగాలలో సుసంపన్నంగా ఉంది. మీ హృదయంలో ఏదో వెలితి ఉంది. దానిని మా ముందుంచండి. మీకు ఉపశమనం కలుగడానికి మా శాయశక్తులా ప్రయత్ని స్తాము!' అని ఓదార్చాడు.

రాజు రవివర్మ ఒకసారి అందరినీ తేరి పారజూసి, 'నేను స్వర్గానికి పోతానో, నరకా నికి పోతానో అంతుపట్టకుండా ఉంది. ఈ అనుమానం నన్ను అనుక్షణం కృంగతీ స్తోంది.' అని తన మనసులోని చింతను బయట పెట్టాడు.

మహారాజు మాటలతో అందరూ స్థాణు వులైపోయారు. తర్వాత ప్రధాన రాజపండి

జి. ప్రియరాణి



తుడు నిలబడి, 'చింతించకండి మహా రాజా! మీరు తప్పక స్వర్గానికే వెళతారు. ఎందుకంటే ప్రజారంజకంగా పరిపాలించే రాజు భగవంతుడితో సమానం!' అన్నాడు ఊరడింపుగా.

ఆ మాటలతో రవివర్మ మండిపడ్డాడు. 'అదే నిజమని ఎలా చెప్పగలరు? మంచి పనులు చేసేవారు సైతం కొన్ని బలహీన క్షణా లలో కాని పనులు చేయవచ్చు. అలాగే నేను కూడా ఏమైనా కాని పనులు చేశానేమో. నాకు నరకప్రాప్తి అని రాసి ఉంటే దానిని తప్పించడానికి చేయవలసిన కార్యాలు వివ రించండి. వెంటనే అమలు చేస్తాము. మీ పండితులంతా చర్చించి నా సమస్యకు పరి ష్కారం చూపండి.' అని చెప్పి సభ చాలిం చాడు మహారాజు రవివర్మ.

మూడు రోజుల తర్వాత సభ జరుగు తుండగా ఒక బ్రాహ్మణ బాలకుడు ఒక పింగాణి జాడితో సభాప్రవేశం చేశాడు. ఆ బాలకుడు సరాసరి రవివర్మ ఎదుటికొచ్చి, భుజం మీదున్న జాడీని కిందికి దించి, 'మహారాజా! నాపేరు శేషేంద్రుడు. రాజ ధానిలో ఒక పూరింట్లో నా తల్లిదండ్రులతో కలిసి ఉంటున్నాను. నా కన్నవాళ్లకు మామిడి ఆవకాయ చాలా ఇష్టం. అందుకే రెండు డజనుల కాయలు ఊరవేశాను. పుణ్యక్షేత్రాల సందర్శనకు వెళ్లిన నా వృద్ధ తలిదండ్రులు నాలుగైదు రోజుల్లో తిరిగొ స్తారు. నేను రేపు ఉదయానే పొరుగు పట్ట ణంలో ఒక శుభకార్యం జరపడానికి పోతు న్నాను. తిరిగి నేను రెండు దినముల తర్వాతే ఇంటికి చేరగలను. తడికెలతో నిర్మించబడ్డ నా ఇంట్లోకి ఎవరైనా చొరబడి దీనిని దొంగి లించకుండా మీ దగ్గర భద్రగా ఉంచండి మహారాజా!' అని ఎంతో దీనంగా విన్నవిం చుకున్నాడు.

శేషేంద్రుడి మాటలు ముందుగా రవి వర్మకు చికాకు కలిగించాయి. ఆగ్రహం తెప్పించాయి. అయినా తల్లితండ్రుల మీద అతనికున్న అపార భక్తి ప్రపత్తులకు మహా రాజు ముగ్ధుడైపోయాడు. ఆ ఊరగాయ జాడీని తన శయనమందిరంలో భద్రపరచ మని భటులను ఆజ్ఞాపించాడు. శేషేంద్రుడు సంతోషంగా వెళ్లిపోయాడు.

నాలుగు రోజుల తర్వాత శేషేంద్రుడు సభాప్రాంగణంలోనికి వచ్చాడు. రవివర్మ ఆ బాలకుడిని ఆహ్వానించి ఒక ఉచితా

సనం చూపించి కూర్చోమన్నాడు. అతని తల్లి తండ్రుల యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. మహారాజు ఆజ్ఞతో శయనమందిరంలో భద్రపరచబడిన పింగాణీ జాడీ తెప్పించబడింది.

మహారాజు రవివర్మ ఎంతో ఆసక్తిగా 'ఊరగాయలను నీవే స్వయంగా తయారు చేశావా లేక ఎవరి సహాయమైనా తీసుకున్నావా?' అని అడిగాడు.

'నేనే స్వయంగా తయారు చేశాను మహారాజా!' అన్నాడు బాలుడు.

'నీ చేతి మహాత్యమేమో గానీ ఆవకాయ చాలా బాగుంది. ఈ జాడీ నాకిచ్చేసి మేమిచ్చే వేయి వరహాల బహుమానం తీసుకో, నీ పేదరికం కూడా తీర్చినట్లుంటుంది!' అనేశాడు రవివర్మ మీసం మెలేస్తూ.

శేషేంద్రుడు పకపకా నవ్వి, 'సందేహం లేదు మహారాజా! మీరు నరకానికే పోతారు!' అన్నాడు. ఆ మాటలతో రాజుతో సహా సభంతా గంభీరంగా మారిపోయింది. శేషేంద్రుడి వంక రవివర్మ అయోమయంగా చూశాడు.

శేషేంద్రుడు మరోమారు నవ్వి, 'ఔను మహారాజా! భద్రంగా కాపాడవలసినపరాయి సొత్తును మీ జిహ్వా చాపల్యానికి బలిచేసిన మిమ్మల్ని నేను క్షమించను. పరాయి సొత్తును పాపంగా భావించనివాడు స్వర్గప్రాప్తికి పూర్తిగా అనర్హుడు. ఆలోచించండి,' అనేశాడు ఎంతో ధీమాగా

సభంతా మౌనంగా ఉండటం చూసి తిరిగి శేషేంద్రుడు నోరు విప్పాడు. 'కాని పని అని తెలిసి కూడా దానిని మూర్ఖంగా చేయడమే నరకానికి మార్గం. మంచి పనిని పదిమంది శ్రేయస్సుకోసం వినియోగించడమే మోక్షప్రాప్తి. స్వర్గానికి, నరకానికీ మధ్య ఉన్నది అదే తేడా!' అన్నాడు చిరుమంద హాసంతో.

ఆ మాటలతో మహారాజు రవివర్మ ఎంతో సిగ్గుపడ్డాడు. శేషేంద్రుడు ప్రధాన పండితుడి కుమారుడేనన్న సంగతి తెలుసుకున్న మహారాజు అతడి బుద్ధి చాతుర్యాన్ని మెచ్చుకుని తగు రీతిగా సత్కరించాడు. అంతేకాదు. ఆనాటి నుంచి విపరీత పోకడలు పోలేదు.





# వంటొచ్చిన మొగుడు

కొత్తగా కాపురానికొచ్చిన నర్మదకు భర్త శరవయ్య ప్రవర్తన తలనొప్పిగా తయారైంది. ఏ పనికీ వెళ్లకుండా వంటగదిలో చేరి, భార్యకు సలహాలివ్వసాగాడు. 'నేను చెప్పినట్లు చేయలేదు. అందుకే కూర రుచిగా లేదు.' అంటూ తినేటప్పుడు వంకలు పెట్టసాగాడు. మొగుడి చాదస్తం భరించలేక, ఓ రోజు ఇంటి పక్కనున్న వంటమేస్త్రి నాగమణితో చెప్పిందోసారి మాటవరుసకు.

'నువ్వు చేసే వంటలన్నీ వంకలు పెడుతున్నాడు అంతే గదా?' అంది వంటమేస్త్రీ.

'అంతే కాదు, ఏ పనీ చేయకుండా ఇంటిపట్టునే ఉంటున్నాడు. కూర్చుని తింటే ఆస్తులు ఎంత కాలం ఉంటాయి చెప్పు?' అంది ఆవేదనగా.

'మీ వారి రోగాన్ని నేను పూర్తిగా సరిచేస్తాగా! బాధపడకు' అంది వంటమేస్త్రి నాగమణికి అభయమిస్తూ.

'ఆ సాయంత్రమే వంటమేస్త్రీ శరవయ్య ఇంటికి వెళ్లి 'మరిదీ, నీకు వంటల రుచి బాగా తెలుసని, మా చెల్లి చెప్పింది. మాకు రేపు బంగారం వ్యాపారి సత్యం గారింట్లో పెద్ద వంట పని ఉంది. ఏ మాత్రం తేడా వచ్చినా ఒప్పుకునే రకం కాదు. నువ్వు మాతో పాటు వచ్చి, కాస్త ఉప్పు, కారం చూశావంటే మా వంట చక్కగా పూర్తవుతుంది. ఊరికే ఏమొద్దు. రెండు వందలు డబ్బు కూడా నీకు ఇస్తాను,' అంది.

'దానికేం తప్పకుండా వస్తాను. నాకు తెలిసినంతగా, వంటల రుచి, మీక్కూడా తెలీదు,' అన్నాడు శరవయ్య గొప్పగా.

మరుసటి రోజు నాగమణి వెంట వెళ్లిన శరవయ్య వంటవాళ్లకు సలహాలివ్వసా

పుప్పాల కృష్ణమూర్తి

గాడు. వాళ్లు పాటించకున్నా, వంటలు రుచి చూడటం, తను ఒప్పుకున్న తర్వాతే వడ్డించడం గొప్పగా అనిపించింది. వాళ్లతో పాటు మునక్కాయలు తరగటం, ఉల్లి పాయలు కోస్తూ, వంట బృందంలో కలిసి పోయాడు.

ఆ సాయంత్రం విందు పూర్తయ్యాక 'మరిదీ, వంటలు అద్భుతంగా ఉన్నా యని అందరూ మెచ్చుకున్నారు. కేవలం నువ్వు రుచి చూడటం వల్లే బాగా కుది రాయి. రేపు కిరాణ వ్యాపారి ఇంట్లో విందు ఉంది. తప్పకుండా రా,' అంది వంటమేస్త్రీ రెండు వందలు చేతిలో పెడుతూ.

'అంతకంటేనా వదినా, తప్పకుండా వస్తాను' అని ఇంటికెళ్లి భార్యతో తన గురించి గొప్పగా చెప్పుకున్నాడు. ఇంత కాలానికి తనకో గుర్తింపు వచ్చిందని అతడు సంబరపడ్డాడు.

మరుసటి రోజు నుంచి వంటవాళ్లతో పాటు కూరగాయలు తరగటం, బియ్యం వడకట్టడం, తాళింపు పెట్టడం వగైరా పంట పనులు మేస్త్రీ చెప్పకుండానే చేయసా గాడు. కూరలు రుచి చూస్తూ, పనివాళ్లను పురమాయిస్తూ వంటలను చకచకా తయారు చేయించసాగాడు. నాగమణి వంట బృందంలో శరభయ్య కూడా ఒక సభ్యుడైపోయాడు. వంట జరిగినప్పుడల్లా నాలుగు వందలు సంపాదించసాగాడు. తమ కంటే నాగమణి ఎక్కువ డబ్బులు తీసుకోవడం కూడ అతడికి నచ్చలేదు. చక్కగా వంట నేర్చుకుని, మంచి వంటవా డిగా గుర్తింపు తెచ్చుకున్నాడు. నలుగుర్ని వెంటబెట్టుకుని తనే స్వయంగా వంటలకు వెళ్లసాగాడు. అచిరకాలంలోనే నగరంలో మంచి వంటమేస్త్రీ అయ్యాడు.

స్వయంగా చేసిన వంటకాలు తినీ తినీ, తినీ మొహం మొత్తింది శరవయ్యకు. ఇంటికొచ్చి, భార్య వండిపెట్టే అన్నం, కూరలు మహాద్భుతంగా అనిపించసా గాయి. వంటలో కష్టం అర్థమైంది కాబట్టి అతడు ఇప్పుడు వంటలపై అస్సలు వంకలు పెట్టడం లేదు.





# బింబ ప్రతిబింబాలు

విశాల నగరంలో వివేకవంతుడనే రాజు ఉండేవాడు. ఆయన ప్రతి ఉదయమూ, సాయంకాలమూ తన భవనం పై భాగానికి వెళ్లి, అక్కడ చల్లగాలిలో పచారు చేస్తూ సూర్యోదయ శోభా, సూర్యాస్తమయ శోభా తిలకిస్తూ ఉండేవాడు.

ప్రతిరోజూ ఒక కట్టెలు కొట్టేవాడు ఉదయం పూట రాజప్రాసాదం పక్కగా కట్టెలు కొట్టడానికి అడవికి వెళ్లి, తిరిగి సాయంకాలం పూట కట్టెల మోపుతో తిరిగి వచ్చేవాడు.

ప్రతి ఉదయమూ, సాయంకాలమూ వాడు రాజుకు కనిపిస్తూనే ఉండేవాడు. అయితే వాడు ఉదయం పూట అడవికి పోతూ కనిపించినప్పుడు మహారాజుకు, 'పాపం! చూడబోతే అసలే ఎముకల గూడులా ఉన్నాడు. ఇంత శ్రమపడితే కాని వాడికి రోజు గడవదు కాబోలు!' అనుకుని జాలి పుట్టుకొచ్చేది.

సాయంకాలంపూట వాడు మోపు నెత్తిన పెట్టుకు వస్తూ కనిపించినప్పుడు మటుకు రాజుకు వాణ్ణి చూడగానే ఎందుకో పట్టరాని ఆగ్రహం వచ్చేంది. 'పాపాత్ముడు, వీడిని నిట్ట నిలువునా చీల్చినా దోషం లేదు!' అనిపించేది.

ఒకే మనిషిని చూస్తే తనలో ఉదయం ఒక భావమూ, సాయంకాలం పూట దానికి విరుద్ధంగా ఇంకొక భావమూ, ఎందుకు కలుగుతున్నదీ రాజుకేమాత్రం అర్థం కాక ఆశ్చర్యం వేసింది.

చివరకాయన తన మంత్రిని పిలిచి అతనితో తన అనుభవం చెప్పి, తనలో

చామర్తి కూర్మాచార్యులు

విరుద్ధ భావాలు కలగడానికి కారణం ఏమై ఉంటుందో తెలుసుకోమన్నాడు.

మంత్రి సరేనని మూడురోజుల వ్యవధి కావాలని అడిగాడు.

మర్నాడు మంత్రి పేదవాడి వేషం వేసుకుని కట్టెలు కొట్టేవాడిని అనుసరించి అడవికి పోయి వాడు రోజల్లా పడే శ్రమ చూసి సాయంకాలం వాడి వెనకనే తాను కూడా వచ్చేశాడు.

రాజుగారు ఆ కట్టెలు కొట్టేవాణ్ణి చూసి ఎందుకు జాలిపడుతున్నదీ మంత్రికి అర్థమయింది. కాని రాజుకు వాడంటే ఆగ్రహం ఎందుకు వస్తున్నదీ తెలియరాలేదు.

రెండోనాడు మంత్రి ఒక సాధువు వేషం వేసుకుని కట్టెలు కొట్టేవాడి ఇంటికేసి వెళ్ళాడు. ఆయన గుమ్మంలో అడుగు పెట్టడం చూసి కట్టెలు కొట్టేవాడి భార్య లోపలికి ఆహ్వానించి కూచోబెట్టి ఎంతో మర్యాద చేసింది. మంత్రికి గంధపు చెక్కల వాసన ఘాటుగా తగిలింది.

'గంధపు చెక్క ఇంట్లో పుష్కలంగా ఉన్నట్లున్నదే. అది అమ్ముకుని వచ్చిన దానితో సుఖంగా బతక్క ఇంత అగచాట్లు పడుతున్నారేం తల్లీ?' అన్నాడు మంత్రి సానుభూతిగా.

'బాబూ, గట్టిగా అనకండి! నా మొగుడు కట్టెలు కొట్టేటప్పుడు ఎప్పుడన్నా గంధపు కర్ర కూడా దొరుకుతుంది. దూరాలోచనతో ధాన్ని ఒక గది నిండా పేర్చి పెట్టాము. ఎప్పుడో ఒకప్పుడు రాజుగారు చావడం జరగవచ్చు. ఆయనను దహనం చేయడానికి గంధం చెక్క కొనేటప్పుడు



ఎంత ధర అయినా ఇస్తారు. అందుకని దాన్ని చిల్లరగా వాళ్లకూ వీళ్లకూ అమ్మక నిలవేసి ఉంచాము!' అన్నది కట్టెలు కొట్టే వాడి భార్య.

రాజుకు కట్టెలు కొట్టేవాడిపైన ఆగ్రహం ఎందుకు కలుగుతున్నదో మంత్రికి తెలిసి పోయింది. కట్టెలు కొట్టేవాడు అడవికి వెళ్లే టప్పుడు తన దారిద్ర్యం గురించి అనుకుం టాడు. తన ఇంటి ఖర్చుకు సరిపడా కట్టెలు దొరకాలని కోరుకుంటాడు. ఆ సమయంలో రాజు వాడి స్థితి చూసి జాలి పడతాడు.

కట్టెలు కొట్టేవాడు తన పని పూర్తి చేసు కుని ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు తాను దాచి ఉంచిన గంధపు కట్టె గురించి అను కుని, రాజు త్వరగా చనిపోతే అదంతా సొమ్ము అవుతుంది గదా అనుకుంటాడు. ఆ సమయంలో రాజుగారికి వాడిమీద పట్టరాని కోపం వస్తుంది.

కట్టెలు కొట్టేవాడి భావాలూ, రాజుగారి భావాలూ బింబ ప్రతిబింబాలు.

మంత్రి కట్టెలు కొట్టేవాడి భార్య వద్ద సెలవు తీసుకుని తన ఇంటికి వెళ్లిపోయి, మర్నాడు ఉదయం మామూలుగానే సభకు హాజరయ్యాడు.

'ఏం మంత్రీ? ఆ రహస్యం అంతు చిక్కిందా?' అని అడిగాడు రాజు.

'నిజం తెలుసుకున్నాను మహారాజా, ఆ కట్టెలు కొట్టేవాడిని శిక్షించనని మాట ఇస్తే తమకు యథార్థం విన్నవించుకుం టాను,' అంటూ జరిగిన సంగతి అంతా చెప్పేశాడు మంత్రి.

కట్టెలు కొట్టేవాడు దరిద్రుడై ఉండటం చేతనే గదా రోజూ తన మరణం కోరుతు న్నాడని గ్రహించి రాజు అతడిని పిలిపించి, తగిన విధంగా మందలించి, కొంత డబ్బు కూడా ఇప్పించి వాడు అట్టే శ్రమ లేకుండా జీవితం గడిపే ఏర్పాట్లు చేయించాడు.






# రైతు పెట్టుకున్న అర్జీ

ఒక ఊళ్ళో ఒక పేద రైతు ఉండేవాడు. వాడికి ఉన్న ఆస్తి ఒక బక్క అవు మాత్రమే. దాన్ని మేపుకునేటందుకు కూడా పేద రైతుకు అవకాశం లేకనే అది అలా చిక్కిపోయింది. ఆ ఆవును రైతు తన దొడ్లోనే కట్టిపెట్టి గడ్డిపరకలు మెయ్యనిచ్చేవాడు.

పేదరైతు దొడ్డిని అనుకునే ఒక పెద్ద భూస్వామి ఆవరణ ఉన్నది. ఆ అవరణలో పశువుల మేత గడ్డి ఏపుగా పెరిగి ఆవుకు కమ్మని వాసన తగిలింది. అది రెండిళ్ల మధ్యా ఉన్న కంచెలో గల కంతనుంచి భూస్వామి ఆవరణలోకి దూకి అక్కడి గడ్డి మెయ్యసాగింది.

ఇది గమనించిన భూస్వామి నౌకరు ఒక దుడ్డు కర్ర తెచ్చి ఆవు తల పగలగొట్టాడు. నౌకరు వేసిన ఒకే ఒక్క దెబ్బకే అది కాస్తా చచ్చి ఊరుకుంది.

రైతు భూస్వామి వద్దకు పరుగెత్తి తనకు జరిగిన అన్యాయం గురించి మొరపెట్టుకున్నాడు. భూస్వామి ఆ రైతు చెప్పిన మాటలనూ, తన నౌకరు చెప్పిన మాటలూ విని, 'నీ ఆవును ఊళ్లోవాళ్ల దొడ్లమీదికి తోలటమే గాక అన్యాయం జరిగిందంటావా?.. రేయ్! వీణ్ణి మన ఇంటి బయటి గుంజకు కట్టేసి పది దెబ్బలు కొట్టి పంపించు,' అని తన నౌకరుతో అన్నాడు.

పేదరైతు ఆవును కోల్పోవటమే గాక భూస్వామి నౌకరు చేత దెబ్బలు కూడా పడి ఇంటికి వచ్చి అంతా తన భార్యతో చెప్పాడు. 'భూస్వామి మనకు న్యాయం చేయకపోతే

ఎస్. సుశీల



ఆగుతుందా ఏమిటి? నువు వెళ్లి ఏకంగా రాజుగారికే ఫిర్యాదు చేయి. రాజుగారు అన్యాయం జరగనివ్వడు. మనకు న్యాయం చేస్తాడు,' అన్నది రైతు భార్య.

అయితే రాజుగారికి జరిగినదంతా స్పష్టంగా నివేదించడమెలాగ? అర్జీలు రాసుకునేటందుకు ఆ భార్యాభర్తలు చదువుకున్నవాళ్లు కారు. అందుచేత వాళ్లు ఒక కొయ్యపలకతెచ్చి దానిమీద ఒక బొమ్మ గీశారు.

అందులో రైతు ఇల్లూ, భూస్వామి ఇల్లూ, మధ్య ఉన్న కంచే, ఆ కంచెలో కంతా, భూస్వామి నౌకరు ఆవును చంపిన చోటూ, ఆ నౌకరే రైతును కొట్టటానికి కట్టే సిన గుంజా, అన్నీ గుర్తులు పెట్టారు.

'భేష్, ఇది చూస్తే రాజుగారికి జరిగిన దంతా అరటిపండు వొలిచిపెట్టినట్లు అర్థ మవుతుంది. నీకు దారిలో తినటానికి రొట్టెలు మూటగట్టి ఇస్తాను. నువు రాజు గారి నగరానికి తిన్నగా బయలుదేరు,' అన్నది రైతు భార్య.

రైతు బయలుదేరి మధ్యాహ్నానికల్లా ఒక వనంలో ప్రవేశించాడు. అది రాజుగారి వనం. ఆ వనంలో రైతుకు ఒక మనిషి కని పించాడు. ఆ మనిషి రాజుగారే. అయితే ఆయన మామూలు దుస్తులతో ఉండటం చేత రైతు ఆయనను చూసి రాజనుకోలేదు.

'దణ్ణాలు, బాబూ!' అన్నాడు రైతు.

'శుభం కలగాలి. ఎవరు నువ్వు? ఎక్క డికి నీ ప్రయాణం?' అని రాజు అడిగాడు.

'ఏముందీ? రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేసుకుందామని వెళుతున్నా. ఇదుగో, అర్జీ నా వీపున కట్టుకున్నా. నా ఆవును అన్యాయంగా చంపారులే! ఆకలి మండి పోతున్నది. కాస్త ఈ రొట్టెముక్క తిన్నాక అంతా చెబుతా,' అన్నాడు రైతు.

ఒక వాగు పక్కన రాజూ, రైతూ చతికిల బడి కూచున్నారు. రైతు తాను తెచ్చుకున్న రొట్టెలోనూ, వెన్నలోనూ సగం రాజుకు ఇచ్చాడు. ఇద్దరూ తినటం ముగించి, వాగులో ఇంత చల్లని నీరు తాగారు.

'ఏదీ నీ అర్జీ!' అన్నాడు రాజు.

రైతు తాను తయారు చేసుకువచ్చిన




పలక తీసి, 'ఇదుగో ఇది మా ఇల్లు. ఈ ఇల్లు భూస్వామిది. ఇది కంచె. ఇక్కడ కంత ఉన్నది. ఈ కంతలోనుంచి మా ఆవు దూరి వారి ఆవరణలో ప్రవేశించింది. ఇక్కడ భూస్వామిగారి మనిషి మా ఆవును దుడ్డు కర్రతో కొట్టి చంపాడు. ఇంత అన్యాయమా అని నేను పోయి భూస్వామితో మొరపెట్టుకుంటే, ఇదుగో, ఈ గుంజకే నన్ను కట్టేసి పది దెబ్బలు కొట్టి, దిక్కున్న చోట చెప్పుకోమన్నారు,' అంటూ అంతా వివరించాడు.

'ఇంకేం? దీన్ని నాకు చూపించినట్టే రాజుగారికీ చూపించు. నీకు న్యాయం జరుగుతుందిలే. ఇక వస్తా!' అంటూ రాజు సెలవు పుచ్చుకుని వెళ్లిపోయాడు.

రైతు మర్నాడు తన అర్జీపలక పట్టుకుని దర్బారు వెళ్ళాడు. దర్బారులో రాజుగారు కిరీటమూ, ఇతర రాజలాంఛనాలూ ధరించి ఎత్తుగా బంగారు సింహాసనంపై కూర్చుని ఉన్నాడు. ఆయన పక్కనే వరుసగా పన్నెండుమంది మంత్రులు కూచుని ఉన్నారు.

రాజును గుర్తించక రైతు అర్జీపలకను చివర కూర్చున్న మంత్రికిచ్చి, 'అయ్యా, ఈ అర్జీ చిత్తగించండి. భూస్వామి గారి మనిషి నా ఆవును చంపటమూ, నన్ను గుంజకు కట్టేసి కొట్టటమూ, అంతా ఇందులో ఉంది. చిత్తగించండి!' అన్నాడు.

మంత్రి ఆ పలకను ఎగాదిగా చూసి, 'ఇదేమిటో నాకు కొంచెం కూడా బోధపడటం లేదు. ఇదేమి అర్జీ?' అంటూ దాన్ని తన పక్కన ఉన్న మంత్రికి ఇచ్చాడు.

ఆ మంత్రి కూడా పలకను ఎగాదిగా చూసి, 'ఇది అర్జీకాదు. ఈ వెర్రివాణ్ణి బయటకు గెంటండి!' అన్నాడు.

అంతలో రాజుగారు కలగజేసుకుని, 'దాన్ని నాకు పంపండి,' అన్నాడు. రైతు తెచ్చిన అర్జీపలక ఒక్కొక్క మంత్రే అందుకుని చూసి, తల అడ్డంగా తిప్పి, తన పక్కవాడికి ఇచ్చాడు. చివరకు ఆ అర్జీపలక రాజుగారికి చేరింది.

ఆయన దానికేసి ఎగాదిగా చూసి, 'ఇది అర్థమవుతూనే ఉన్నది. ఏమోయ్,

ఇలా రా!' అని రైతును పిలిచాడు.

'ఇది నీ ఇల్లూ, ఇదేమో భూస్వామి ఇల్లూనూ. అవునా?' అని రాజు అడిగాడు.

'చిత్తం,' అన్నాడు రైతు.

'ఇది కంచెలో కంతలాగుంది. దీనిలో నుంచే గదా నీ ఆవు భూస్వామి ఆవరణలో జొరబడింది?' అన్నాడు రాజు.

'మరేనండీ!' అన్నాడు రైతు.

'మిగిలింది కూడా తెలుస్తూనే ఉంది. భూస్వామి మనిషి ఇక్కడ నీ ఆవును చంపి ఉంటాడు. నిన్ను ఈ గుంజకు కట్టి కర్రతో కొట్టి ఉంటారు,' అన్నాడు రాజు.

'తమరు ఉన్న సంగతి సరిగా కనిపెట్టా రండీ,' అన్నాడు రైతు దిగులుగా.

'సరే, నువు మీ ఇంటికి తిరిగి వెళ్లి, నేను న్యాయం చేస్తానని నీ భార్యతో చెప్పు!' అన్నాడు రాజు.

రైతు రాజుగారికి దణ్ణాలు పెట్టి, మంత్రులకేసి కోపంగా చూసి ఇంటికి వచ్చేశాడు. ఆ సమయానికే రాజుగారి తీర్పు కూడా భూస్వామికి అందింది. భూస్వామి రైతుకు క్షమాపణలు చెప్పుకో వడమే గాక, ఒక ఇల్లూ, పశువుల సావడీ కట్టించి, ముప్పై కుంటల పొలమూ, ఏడు పాడి ఆవులూ ఇచ్చుకునేటట్టు రాజుగారు తీర్పు ఇచ్చాడు.

'రాజుగారు మనకు న్యాయం చేస్తాడని నేను చెప్పానా లేదా?' అన్నది రైతు భార్య ఆనందంగా.

'రాజుగారికేం? ఆయన ఎంత తెలివైన వాడు! మనం కష్టపడి తయారు చేసిన ఆర్జీని చూస్తూనే అంతా తెలుసుకున్నాడు. కాని వింత విషయం ఏమిటంటే ఆయన దగ్గర పన్నెండుమంది మంత్రులు ఉన్నారు. వట్టి మట్టిబుర్రలు! అంత తెలివిగలవాడు. ఇంత మంది చవటలను జీతం ఇచ్చి ఎందుకు పెట్టుకున్నాడో అర్థం కావటం లేదు!' అన్నాడు రైతు ఆశ్చర్యంతో.





# చిల్లర నాణేలు

లలితపురం గ్రామంలో లక్ష్మమ్మ, నారాయణ అనే దంపతులు ఉండేవారు. పదుగురికి సహాయపడుతూ జీవనం సాగించేరు. వారికి శివుడు ఒక్కగా నొక్క కొడుకు.

శివుడికి పదేళ్ల ప్రాయంలో తండ్రి నారాయణ గుండెపోటుతో మరణించాడు. అప్పటి నుంచి లక్ష్మమ్మే ఆ ఇంటా ఈ ఇంటా పాచిపని చేస్తూ కొడుకును కష్టం మీద పోషించేది.

కొన్నేళ్లు గడిచాక, లక్ష్మమ్మకు పక్షవాతం వచ్చింది. తల్లిని పోషించడానికి శివుడు చదువు మానేసి కూలిపనులు చేయసాగాడు. కొడుకు కష్టపడటం చూసి లక్ష్మమ్మ కన్నీరు పెట్టుకునేది. అప్పుడు శివుడు 'అమ్మా! నీకు సేవచేయడం నాకు సంతోషమే కాని, కష్టం కాదు', అని ఓదార్చేవాడు.

కొంతకాలానికి లక్ష్మమ్మకు మరణ ఘడియలు సమీపించాయి. ఆమె కొడుకును చేరబిలిచి 'నాయనా! నాకోసం ఎంతో కష్టపడ్డావు. నాకు ఎన్నో సేవలు చేశావు. నీకంతా మంచే జరుగుతుంది. నీకు నేను ఇవ్వగలిగింది ఈ చిల్లర నాణేలే! ఇవే నీకు మంచి చేస్తాయి', అంటూ కొడుకు చేతిలో ఒక చిల్లు కాణీ, అర్ధణా, అణా, బేడా నాణేలు పెట్టి కన్నుమూసింది.

శివుడు తల్లి ఇచ్చిన చిల్లరనాణేలు భద్రంగా దాచి పెట్టుకుని, ఆమెకు అంత్య క్రియలు జరిపాడు.

తల్లి మరణానంతరం శివుడా ఊరిలో ఉండలేక మరోచోటికి బయలు దేరిపోయాడు. శివుడికి ఎటు పోవాలో అర్థం కాలేదు. అంతలో ఒక బిక్షగాడు ఎదురుపడి సాయం అడిగాడు. శివుడు జేబులో చేయి

ఎన్. శివనాగేశ్వరరావు



పెడితే చిల్లు కాణీ దొరికింది. దాన్ని బిక్ష గాడికి దానం ఇచ్చాడు. అప్పుడా బిక్షగాడు, 'నాయనా! తూర్పు దిక్కుగా వెళ్లు! నీకు శుభం జరుగుతుంది', అని దీవించాడు.

శివుడు తూర్పు దిశగా ప్రయాణం సాగించాడు. కొద్ది రోజుల ప్రయాణానం తరం శివుడు ఒక చిట్టడవి చేరాడు.

ఆ అడవిలో దుర్రూరుడు అనే రాక్ష సుడు ఉన్నాడు. వాడు నరవాసన తగిలి నంతనే హుటాహుటీన వచ్చి శివుడికి ఎదురు నిలిచాడు. తాటిచెట్టు ప్రమాణంలో ఉన్న రాక్షసుడిని చూసిన వెంటనే శివుడికి భయం వేసింది. నీకు అంతా మంచే జరు గుతుంది అన్న తల్లి దీవెన గుర్తుకొచ్చి ధైర్యం తెచ్చుకున్నాడు.

అంతలో దుర్రూరుడు, శివుడితో, 'ఒరేయ్ మానవా! చాలా కాలానికి నర మాంసం కంటబడింది. అయితే నాకో అచ్చిరాని సంఖ్య ఉంది. నీవు ఒకటి నుంచి తొమ్మిది వరకు గల ఒక సంఖ్య చెప్పు. నీవు చెప్పింది నాకు అచ్చిరాని సంఖ్య అయితే నిన్నొదిలేస్తాను. కాకుంటే నిన్ను కబళిస్తాను', అన్నాడు.

శివుడు జేబులో చెయ్యి పెట్టి తడిమితే తల్లి ఇచ్చిన చిల్లర నాణేలలోని అర్ధణా తగిలింది. శివుడు సందేహించక 'మూడు' అని రాక్షసుడితో చెప్పాడు.

అది విన్నంతనే రాక్షసుడు ముఖం చిట్లించి 'నాకు అచ్చిరాని సంఖ్య అదే? ఆ సంఖ్య చెప్పిన నిన్ను తింటే నాకు తంటానే, తక్షణం నా ముందునుంచి తప్పుకో!' అని కసురుకున్నాడు.

శివుడు పెనుప్రమాదం నుంచి తప్పిం చుకున్నందుకు సంతోషిస్తూ త్వరత్వరగా ఆ ప్రాంతం వీడి ముందుకు సాగాడు. మరి కొద్ది రోజులు అటూ ఇటూ తిరు గుతూ, ఒక కోయగూడెం చేరాడు. శివుడిని చూసినంతనే అక్కడి కోయలు, అతడ్ని బంధించి, తమ నాయకుడు శరాబంది వద్దకు తీసుకుపోయారు.

శరాబంది, శివుడిని చూసినంతనే ఆగ్ర హించి, 'మా గూడెంలో అడుగుపెట్టిన వారిని మేము ప్రాణాలతో వదిలేది లేదు. అయితే మాకో నియమం ఉంది', అని శివుడిని అమ్మవారి నిలువెత్తు విగ్రహం ముందుకు తీసుకుపోయాడు.

అక్కడ అమ్మవారి పాదాల చెంతన

ఆరులోటాలు ఉన్నాయి. శరాబంది ఆ లోటాలను శివుడికి చూపించి, 'వాటిల్లో ఒక లోటాలో ద్రాక్షరసం ఉంది. మిగిలిన వాటిల్లో విషం ఉంది. నీవు ఏదో ఒక లోటా తీసుకుని తాగు. అమ్మవారి దయ నీమీద ఉంటే బతికిపోతావు. లేకుంటే చచ్చిపో తావు', అన్నాడు.

శివుడు చనిపోయిన తల్లిని మనసులో తలుచుకుని జేబులో చేయిపెట్టి ఒక నాణెం బయటకు తీశాడు. అది అణా. శివుడు వెంటనే అక్కడున్న లోటాల్లో ఆరో లోటా తీసుకుని తాగేశాడు. అది ద్రాక్ష రసం కావడంతో శివుడు బతికిపోయాడు.

శరాబంది, శివుడిని మెచ్చుకుని 'అదృ ష్టవంతుడివి. అమ్మవారి దయ నీమీద ఉంది. నీవు బయలు దేరవచ్చు', అన్నాడు.

శరాబంది స్వయంగా శివుడిని అడవి వెలుపలికి తీసుకుపోయి, 'దక్షిణదిశగా వెళ్తే సువర్ణపురి రాజ్యం వస్తుంది', అని చెప్పాడు.

శివుడు, సువర్ణపురి రాజ్యం చేరేసరికి అక్కడ వేలాదిమంది ప్రజలు గుమిగూడి కనిపించారు. శివుడు విషయం ఏమిటని అక్కడ వారిని అడిగాడు.

అక్కడి వారు 'మా రాజ్యం రాజు సువర్ణ ధీరుడు ఆకస్మికంగా మరణించాడు. అత డికి వారసులు లేనందున, పట్టపుటేనుగు ఎవరి మెడలో మాలవేస్తే వారు రాజు అవు తారు. సమయానికి వచ్చావు. నీ అదృష్టం పరీక్షించుకో', అని సలహా ఇచ్చారు.

శివుడు జేబులో చేయి పెడితే తల్లి ఇచ్చిన బేడ నాణెం దొరికింది. శివుడు ఆ నాణేన్ని గాలిలోకి ఎగురవేసి అది కింద పడిన చోటికి వెళ్లి నిలబడ్డాడు. కొంత సేపటికి అటుగా వచ్చిన పట్టపుటేనుగు శివుడి మెడలో పూల మాల వేసింది. సువర్ణపురి ప్రజలు జయ జయధ్వానాలు చేస్తూ శివుడిని రాజుగా ఎన్నుకున్నారు.

తల్లి ఇచ్చిన చిల్లర నాణేల సహాయంతో సువర్ణపురి సింహాసనం అధిష్టించిన శివుడు శివసేన మహారాజుగా జనరంజకమైన పరిపాలన గావించాడు.



# వ్యాపారలౌక్యం

వీణాపురిలోని ఆదిశేషయ్యది కూరగాయల దుకాణం. సోముడు ఆయనకు సహాయకుడిగా ఉండేవాడు. సరసమైన ధరలకే తాజా కూరగాయలు అమ్మడం వలన, ఆ దుకాణానికి ఇతరగ్రామాల ప్రజలు కూడా వస్తుండేవారు. ఒకరోజు ఉదయాన, వెంకటాద్రి అనే పొరుగూరు భూస్వామి పెద్ద జాబితా ఇచ్చి, త్వరగా ఆయా కూరగాయలను ఇమ్మన్నాడు. ఆదిశేషయ్య, సోముడు జాబితా ప్రకారం తూకంవేసి బుట్టల్లో సర్దసాగారు.

ఇంతలో రామేశం అనే ఉపాధ్యాయుడు దుకాణం వద్దకు వచ్చాడు. ఆయనను చూడగానే ఆదిశేషయ్య తన పనిని ఆపి, అవసరమైన కూరగాయలు ఇచ్చి పంపాడు. ఈ వ్యవహారం చూసి వెంకటాద్రి ముఖం చిట్లించుకోవడం సోముడు గమనించాడు. కొంతసేపటి తర్వాత వెంకటాద్రి డబ్బిచ్చి తన సరుకును తీసుకెళ్ళాడు.

అతను అలా వెళ్ళగానే, 'మీ పద్ధతి వెంకటాద్రికి ఇబ్బంది కలిగించింది. రెండు వరహాల సరుకును తీసుకున్న రామేశానికి ప్రాధాన్యతనిచ్చి, రెండువందల వరహాలిచ్చిన వెంకటాద్రిని పక్కకు పెట్టడం సమంజసంగా లేదు' అన్నాడు సోముడు.

'వెర్రివాడా.. రామేశం రోజూ మన దుకాణానికే వచ్చి కూరగాయలు కొనుక్కుని వెళతాడు. మనం కాసేపు నిల్చోబెట్టినా, అవమానపడి ఇంకో దుకాణానికి మారతాడు. ఫలితంగా దీర్ఘకాలంలో నష్టపోతాం. అదే వెంకటాద్రి విషయంలో ఎలాగూ సగం కూరగాయలు కట్టి ఉన్నాం కావున, తను ఎక్కడికీ వెళ్ళలేడు. పైగా ఇది ఆయాచితంగా వచ్చిన వ్యాపారమేగాని నిత్యం జరిగేది కాదు. దీనికోసం రామేశం లాంటి వారి విశ్వాసాన్ని మనం కోల్పోకూడదు.' నవ్వుతూ చెప్పాడు ఆదిశేషయ్య. వ్యాపారలౌక్యంలో కొత్త మెలకువను తెలుసుకున్నందుకు సోముడు ఎంతగానో సంతోషించాడు. – ఎస్. సుధారాణి



# నిజంలాంటి అబద్ధం

నిజంలాంటి అబద్ధం చెప్పినవారికి బంగారు మామిడిపండ్లు ఇస్తానని ఒక తోచీ తోచని రాజు రాజ్యమంతటా చాటింపు వేయించాడు.

బంగారు మామిడిపండుపై ఆశతో దేశదేశాల నుండి ఎందరెందరో వచ్చి రకరకాల అబద్ధాలు చెప్పారు. కాని రాజుకు అవేవీ నచ్చలేదు. అందులో కొన్ని నిజం కూడా కావచ్చు. మిగిలినవి పచ్చి అబద్ధాలు. అందుచేత రాజుగారు బంగారు మామిడిపండును ఎవరికీ ఇవ్వలేదు.

ఒకనాడు ఒక బిచ్చగాడు పెద్ద కుండ పట్టుకుని రాజుగారి వద్దకు వచ్చాడు.

'ఏం కావాలి నీకు?' అన్నాడు రాజు.

'నాకు తమరు ఈ కుండెడు బంగారం బాకీ ఉన్నారు. ఇప్పించండి.' అన్నాడు బిచ్చగాడు.

'అబద్ధం! నేను నీకేమీ బాకీ లేను,' అన్నాడు రాజు.

'అబద్ధమా? అయితే ఆ బంగారు మామిడిపండు నా మోహాన పారెయ్యండి!' అన్నాడు బిచ్చగాడు.

రాజుగారు సంతోషించి వాడికి బంగారు మామిడిపండు ఇచ్చేశాడు.





# రుద్రమదేవి

మన దేశం ఎందరో వీర వనితలను కన్నది. దేశం కోసం ప్రాణాలు అర్పించి, యుద్ధాలలో పరాక్రమం చూపి, ఎంతో సమర్ధతతో రాజ్యాలను ఏలీ చరిత్ర ప్రసిద్ధి గన్న వీరవనితలు మనదేశంలో ఎందరో ఉన్నారు. అటువంటివారిలో ఒకతె కాకతీయ రుద్రమదేవి.

దక్షిణ భారతదేశంలో సామ్రాజ్యాలు స్థాపించిన వారిలో కాకతీయులు ఒకరు. కాకతీయ సామ్రాజ్యంలో ప్రజలు చాలా సుఖంగా ఉండేవారు. కళలూ, సంస్కృతీ బాగా విస్తరించాయి.

కాకతీయ రాజులలో గణపతి దేవుడు ఒకడు. ఈయనకు ఒకే ఒక కుమార్తె కలిగింది. ఆమె రుద్రమ్మ. తండ్రి అనంతరం సామ్రాజ్యాన్ని ఏలవలసినది కావటం చేత రుద్రమ్మ చిన్నతనం నుంచి కత్తిసామూ, గుర్రపు స్వారీ, యుద్ధతంత్రమూ, రాజ్యతంత్రమూ మొదలైనవన్నీ నేర్చుకున్నది.

రుద్రమ్మ తల్లి నారమ్మ. తనకున్న ఒక్క కూతురూ లలితకళలు నేర్చుకోవడానికి బదులు ఇలా మగవాడిలాగా యుద్ధ విద్యలు అభ్యసించడం ఆమెకు కొంచెం కూడా నచ్చలేదు. ఇదేమీ బాగా లేదని ఆమె తన భర్త అయిన గణపతి దేవుడితో చాలాసార్లు అన్నది. కాని గణపతిదేవుడు ఆమెకు ఎలాంటి సమాధానం చెప్పక చిరునవ్వు నవ్వి ఊరుకునేవాడు.

రుద్రమ్మ ధోరణి ఆమె చెలికత్తెలకు కూడా ఏమాత్రమూ నచ్చలేదు. రుద్ర

మదేవి మామూలు రాజకన్యలాగే ఉండి, మంచి నగలూ, నాణ్యాలూ ధరించి, సుకుమారంగా పెరిగి, యుక్తవయసు రాగానే తగిన వరుణ్ణి పెళ్లాడి పిల్లలను కనటం మంచిదని వారి ఉద్దేశం.

అందుచేత ఆమె బుద్ధి మార్చడా నికిగాను వారందరూ కూడబలుక్కుని ఒక ఆలోచన చేశారు. ఒకనాడు రుద్ర మదేవి ఉద్యానవనంలో కూచుని ఉండగా, చెలికత్తెలు ఒకరి తరవాత ఒక రుగా వచ్చి, 'జయము, జయము యువరాజుకు!' అన్నారు.

ఈ మాటలు విని రుద్రమ్మ బిడియ పడిపోతుందని వారి ఉద్దేశం. కాని అటు వంటిదేమీ జరగలేదు.

రుద్రమ్మ వాళ్లకేసి నిశ్చలంగా చూసి, 'యువరాజు వల్ల మీకు కావలసిన పని ఏమిటి?' అని అడిగింది.

చెలికత్తెలు ఏమనటానికీ తోచక ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

'ఎందుకు సంకోచిస్తారు? మీ కోరిక ఏమిటో నాకు తెలపండి. దానిని తీర్చ టానికి నేను సిద్ధంగా ఉన్నాను,' అన్నది రుద్రమ్మ.

తమ కడుపులో ఉండే ఉద్దేశం పూర్తి చేసుకోవడానికి ఇది కూడా మంచి అవ కాశమేనని చెలికత్తెలకు తోచింది. వారు రుద్రమ్మతో, 'మాకు వేరే కోరిక ఏమీ లేదు. మీరు ఆయుధాలు ముట్టనని మాకు మాట ఇస్తే చాలు!' అన్నారు.

తనచేత అస్త్రవిద్యాభ్యాసం మాన్పిం చాలని వారికి గల మొండిపట్టు చూసి



రుద్రమ్మ మండిపోయింది. తాను ఆయుధ విద్యలు అభ్యసించటం తన తండ్రికి ఎంతో ఇష్టం. అందుచేత వాటిని మానే ఉద్దేశం ఆమెకు ఏ కోశానా లేదు. అయితే తన చెలికత్తెలు ఏమి కోరితే అది చేస్తానని అన్నది గనక రుద్రమ్మ వారితో, 'మీరు కోరినట్లు నేను అస్త్రసన్యాసం చేస్తాను. కాని అందుకు ఒక షరతు ఉన్నది. అదేమిటంటే, నన్ను ఎవరైనా సరే అస్త్రవిద్యలో ఓడించగలగాలి. ఆ తర్వాత అస్త్రసన్యాసం తప్పక చేస్తాను,' అన్నది.

ఆమె చెలికత్తెలు ఈ మాటలకు చాలా సంతోషించి, ఈ శుభవార్తను రుద్రమ్మ తల్లి నారమ్మకు కూడా తెలియజేశారు. చెలికత్తెలలాగే నారమ్మ కూడా తన కూతురు అస్త్రాల పోటీలో సులువుగా ఓడిపోతుందనుకున్నది. ఆమె మంత్రిని పిలిచి, 'అమ్మాయిని కత్తిసాములో ఓడించగలవాణ్ణి ఒకణ్ణి చూసి పిలిపించాలి,' అన్నది.

మంత్రి నవ్వి, 'కత్తిసాములో అమ్మాయిని జయించగలవాళ్ళున్నారని నాకు తోచదు,' అన్నాడు.

నారమ్మ ఆశ్చర్యపడి, 'అంత చోద్యంగా చెబుతారేమిటి? నిన్నగాక మొన్న కత్తిసాము నేర్చిన అమ్మాయిని ఓడించేవాళ్ళే మన దేశంలో లేరంటే నమ్మటం ఎలా?' అన్నది.

'నేను ఇచ్చకాలు మాట్లాడటం లేదు. మహారాణీ! మన సేనాని కొడుకు కత్తిసాములో చాలా గట్టివాడు. ఎందరినో



ఓడించినవాడు. కావలిస్తే అతనికీ, అమ్మాయికీ కత్తిసాములో పోటీ పెట్టి చూడవచ్చు,' అన్నాడు మంత్రి.

మర్నాడే సేనాని కొడుకూ, రుద్రమ్మకూ కత్తిసాములో పోటీ ఏర్పాటు చేశారు. ఈ కత్తిసాము జరిగేటప్పుడు రాణి నారమ్మా, మంత్రీ కూడా ఉన్నారు.

పోటీ ఎంతో సేపు జరగలేదు. త్వరలోనే రుద్రమ్మ తన ప్రత్యర్థిని నిరాయుధుణ్ణి చేసి పోటీలో గెలిచింది.

రాణి నిర్ఘాంతపోయింది. కాని తన కుమార్తె చేత అస్త్రసన్యాసం చేయించాలన్న పట్టుదల మటుకు ఆమెలో మరింత పెరిగింది. ఆమె గణపతి దేవుడి అనుమతి పొంది మరీ దేశదేశాల చాటింపు వేయించింది. ఆ చాటింపు ఉద్దేశం ఏమంటే, ఎవరైనా రుద్రమ్మను అస్త్ర విద్యలో ఓడించగలిగితే వారికి సేనాని పదవి ఇస్తామని.

ఈ చాటింపు విని ఎందరో యోధులూ, రాజకుమారులూ రుద్రమ్మను ఓడించటానికి వచ్చారు. కాని వారిలో ఒక్కరు కూడా రుద్రమ్మదేవిని ఓడించలేకపోయారు. అందుచేత రుద్రమ్మ అస్త్రసన్యాసం చేయనేలేదు.

గణపతి దేవుడికిలాగే రుద్రమ్మకు కూడా ఆడపిల్లలే కలిగారు. అందుచేత ఆమె తన కూతురి కొడుకైన ప్రతాప రుద్రుణ్ణి పెంచుకున్నది.

గణపతి దేవుడి తదనంతరం రుద్రమ్మ కాకతీయ సామ్రాజ్యాన్ని చాలా కాలం పరిపాలించింది. ఆమె రాజ్యం చేస్తూ ఉండగా ప్రతాపరుద్రుడు యువ రాజుగా ఉండి కొంత రాజ్యభారాన్ని కూడా పంచుకున్నాడు.

రుద్రమదేవి రాణిగా చాలా సమర్థురాలు. ఆమె పరిపాలన కాకతీయ సామ్రాజ్యానికి ఒక స్వర్ణయుగం లాంటింది.





# సింహబలుడు

రామాపురంలో సింహబలుడు అనే పొట్టి వాడు ఉండేవాడు. వాడు విలువిద్య, కత్తి సాము నేర్చుకున్నాడు. కాని పొట్టిగా ఉండటం చేత రాజుగారి కొలువులో వాడికి ఉద్యోగం లభించలేదు. దానితో వాడు ఏ పనిలేక సోమరిగా మారాడు. ఒకరోజు, అతి కష్టం మీద దండనాయకుడిని కలుసుకుని కొలువులో ఉద్యోగం కోరాడు. దానికి దండనాయకుడు 'నువ్వు ఇంకో రెండు అడుగులు పెరిగినట్లయితే ఉద్యోగం లభిస్తుంది. ప్రయత్నించి చూడు,' అని వేళాకోళం చేశాడు. సింహబలుడు నిరాశతో ఇంటిదారి పట్టాడు.

సింహబలుడు మార్గ మధ్యంలో ఒక చెట్టు కింద విశ్రమించాడు. వాడు నిద్ర లేచే సమయానికి ఎదురుగా ఒక యువకుడు కన్పించాడు. 'నేను విజయుణ్ణి, పక్క గ్రామంలో ఒక పులి ప్రజల్ని ఇబ్బంది పెడుతున్నదని దండనాయకుడికి తెలిసింది. దాన్ని చంపమని నన్ను ఆదేశించారు,' అన్నాడు.

సింహబలుడు ఒక నిమిషం ఆలోచించి, 'నేను అందుకే వెళుతున్నాను. ఆ పులిని బంధించి నా వీరత్వాన్ని దండనాయకుడికి చూపిస్తాను,' అన్నాడు.

ఇద్దరూ చక్రపురానికి చేరుకున్నారు. గ్రామ పెద్ద వారిని ఆహ్వానిస్తూ 'గ్రామ ప్రజలు పులి కారణంగా ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బ్రతుకుతున్నారు. అది ఇప్పటికి పది ఆవుల్ని, ఆరు గొర్రెలను, ముగ్గురు యువకులను చంపింది,' అన్నాడు.

ఎమ్. ఆనందరావు

'నేనైతే ఆ పులిని నా చేతులతో పట్టి చంపగలను కాని దండనాయకుడు పంపిన విజయుడికే మొదటగా ఆ అవకాశం ఇవ్వండి,' అన్నాడు సింహబలుడు. వాడు గ్రామస్తులు పెట్టిన ఫలహారాలు శుభ్రంగా తిని వారు ఇచ్చిన వసతిలో నిద్రపోయాడు.

విజయుడు ఒక ఆవును చెట్టుకు కట్టి, సమీపంలో గల మరొక చెట్టుపై విల్లుతో పులికోసం ఎదురు చూడసాగాడు. కాని పులి రాలేదు. ఈ విధంగా మూడురోజులు గడిచాయి. కాని పులి మాత్రం గ్రామంలో నికి జొరబడి నిద్రిస్తున్న ఒకరైతుని తీవ్రంగా గాయపరిచింది.

విజయుడు గ్రామ పెద్దలతో, 'పులి మనిషి రక్తం రుచి మరిగింది. కాబట్టి అది ఆవు కోసం రాదు. అందుకనే ధైర్యవంతు డైన ఒక మనిషిని ఆవు స్థానంలో కడదామ నుకుంటున్నాను. మీలో ఎవరైనా ధైర్య వంతుడు ముందుకు రండి,' అన్నాడు.

గ్రామ ప్రజలు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. గ్రామపెద్ద నవ్వుతూ, 'దీనికోసం మన సింహబలుడు ఉన్నాడు. అతడు సింహాలను సైతం వట్టిచేతులతో చంపగల సమర్థుడు,' అన్నాడు.

తనను పులికి ఎరగా కట్టడానికి వచ్చారని తెలిసి సింహబలుడికి పై ప్రాణాలు పైనే పోయాయి. 'నాకు అవమానం జరిగింది. ఒక మహా వీరుడిని ఆవు స్థానంలో కడ తారా!' అంటూ అరిచాడు. కాని గ్రామ



స్థులు గట్టిగా కోరడంతో అతడందుకు అంగీకరించక తప్పలేదు.

సింహబలుడు ఆవుస్థానంలో కూర్చు న్నాడు. చెట్టుపైన ఉన్న విజయుడు పులి కోసం ఎదురుచూడసాగాడు. ఆవుకి కట్టిన తాడు నేలపై పడి ఉంది. సింహబలుడు కొన్ని గులకరాళ్లను ఏరుకుని చెట్టుపై ఉన్న విజయుడిని గురిచూసి కొట్టసాగాడు. విజ యుడు, 'ఎందుకు రాళ్లు విసురుతు న్నావు?' అని కోపంగా అన్నాడు. 'నీకేం, చెట్టు మీద హాయిగా ఉన్నావు. నువ్వు నిద్రపోతే నేను ఏమైపోవాలి?' అన్నాడు సింహబలుడు. విజయుడు చెట్టుమీద నుండి కిందికి దిగి ఆవుకి కట్టిన తాడును సింహబలుడి నడుంకి చుట్టి 'పులిచేతిలో

చావు తరువాత విషయం.. సరిగ్గా ఉండక పోతే ముందుగా నా చేతిలోనే చావగలవు,' అన్నాడు.

విజయుడు చెట్టుపైకి చేరి పులికోసం ఎదురు చూడసాగాడు. సింహబలుడు మాత్రం అరవడం, రాళ్లు విసరటం, పాటలు పాడటం మానలేదు.

అర్థరాత్రి సమయంలో ఇద్దరూ నిద్ర లోకి జారుకున్నారు. పులి నెమ్మదిగా సింహ బలుడిని సమీపించింది. సింహబలుడు మేల్కొని చిన్నగా శబ్దం చేయసాగాడు. కాని దురదృష్టం కొద్ది విజయుడికి మూడు రోజులుగా నిద్రలేకపోవడం చేత మంచి నిద్రలో ఉన్నాడు.

పులి సింహబలుడి మీదకు ఉరికింది. వాడు పెడబొబ్బలు పెడుతూ పరిగెత్తాడు. కాని నడుంకి చుట్టిన తాడు విప్పేసమయం లేకపోవడంతో వాడు పులినుండి తప్పించు కోవడానికి తాడును కట్టిన దుంగ చుట్టూ పరిగెత్తసాగాడు. పులి వాడిని వెంబడిం చింది. ఇంతలో విజయుడు నిద్రలేచి, 'మిత్రమా నువ్వు పరుగెత్తడం ఆపితే నేను బాణాల్ని వెయ్యగలను,' అన్నాడు.

'నేను ఆగితే పులికి ఆహారంగా మారడం ఖాయం,' అంటూ సింహబలుడు మరింత వేగంగా దుంగ చుట్టూ పరిగెత్తసాగాడు. పులి, సింహబలుడు దుంగ చుట్టూ వేగంగా తిరగడం వలన విజయుడు బాణాల్ని వెయ్యలేకపోయాడు. కాని సింహబలుడికి కట్టిన తాడు పులి కాళ్ల మధ్యలో పడటంతో దాని వెనుక రెండు కాళ్లు తాళ్ల మధ్యలో చిక్కుకున్నాయి.



పులి కదలలేని పరిస్థితిని గమనించి సింహబలుడు పులి వీపు మీద కూర్చుని దాని మెడను గట్టిగా వడిసి పట్టుకొన్నాడు. సింహబలుడి ఆర్తనాదాలకు గ్రామస్తులు చేరారు. వారు సింహబలుడిని పొగడ్తలతో ముంచెత్తారు.

'నేను పొట్టివాడిని, నన్ను చూసి అందరూ నవ్వుతారు. ఈ పులిని రాజుగారికి కానుకగా ఇచ్చి, మంచి బహుమతి సంపాదించు,' అన్నాడు సింహబలుడు.

'నాకు కొలువులో ఉద్యోగం ఉంది పైగా నీవే దానిని బంధించావు. దీనితో నువ్వు కొలువులో చేరవచ్చు,' అని విజయుడు సింహబలుడిని ఒప్పించాడు.

సింహబలుడు రాజధానికి చేరుకొని, మహారాజుకు పులిని కానుకగా ఇచ్చాడు. మంత్రి లేచి, 'ప్రభూ! ఈ పొట్టివాడు పులిని బంధించడం విచిత్రంగా ఉంది, ఎవరైనా సాక్ష్యులు ఉంటే బావుండు,' అన్నాడు.

మంత్రి మాటలు సింహబలుడికి అవమానకరంగా తోచాయి. 'నేను ఈ పులిని బంధించాను అనడానికి విజయుడు సాక్ష్యం. అతను మీ కొలువులోనే పనిచేస్తున్నాడు,' అన్నాడు.

మంత్రి పగలబడి నవ్వుతూ, 'మన కొలువులో విజయుడు అనేవాడెవ్వడూ లేడు,' అన్నాడు. మహారాజు లేచి నిలబడ్డాడు. వెంటనే నవ్వులు ఆగిపోయాయి. అప్పుడు మహారాజు మాట్లాడుతూ, 'నేనే ఆ విజయుణ్ణి, ఇతడు తనను చంపడానికి వచ్చిన పులిని సైతం చంపకుండా దానిపై దయ చూపించాడు. కాని ఇంత ఉన్నత స్థానంలో ఉన్న మనం అభినందించవలసిన ఇతడిని అవమానిస్తున్నాం,' అన్నాడు.

రాజు, సింహబలుడిని దండనాయకుడిగా నియమించాడు. సింహబలుడు రాజు నమ్మకాన్ని వమ్ము చేయకుండా మంచి పేరు తెచ్చుకున్నాడు.





# ఇద్దరు కుమారులు

వైశేషికపుర రాజు ఏకముఖుడికి సుమంతుడు, వసంతుడు అనే ఇద్దరు కుమారులు కలరు. ఇరువురినీ కేదారుడి గురుకులంలో విద్యార్థులుగా చేర్చాడు. ఏకముఖుడికి తన కుమారులపై అమితమైన వాత్సల్యం. ఇద్దరినీ సమభావంతో చూస్తూ, తన తదనంతరం రాజ్యాన్ని చెరిసగం చేసి ఇవ్వాలనేది అతని ఆకాంక్ష. ఆ ఇద్దరికీ పాలనలో, యుద్ధవిద్యల్లో ప్రత్యేక శిక్షణనిమ్మని కేదారుడిని కోరాడు.

కొంతకాలం గడిచాక కుమారుల విద్యా ప్రగతిపై కేదారుడిని ప్రశ్నించాడు ఏకముఖుడు. కేదారుడు జవాబిస్తూ, 'మహారాజా, మీరు కోరినవిద్యలను ఇద్దరికీ నేర్పుతున్నాను. అయితే సుమంతుడికి మాత్రమే పరిపాలనపై ఆసక్తి ఉంది. పరిపాలనకు చెందిన ప్రతి సూక్ష్మాన్నీ తను శ్రద్ధగా అవగాహన చేసుకుంటున్నాడు. కానీ, వసంతుడికి మాత్రం ఇవేవీ ఆసక్తిని కలిగించడం లేదు. ప్రకృతిని పరిశీలిస్తూ.. చిత్రాలు వేస్తూ, కవిత్వం వ్రాస్తున్నాడు. తనకు వాటి పట్లే అమితకాంక్ష!' అన్నాడు.

ఒకనాడు ఆకస్మికంగా మారువేషంతో కాలినడకన ఏకముఖుడు గురుకులానికి చేరుకున్నాడు. ఒక పెద్దచెట్టు చాటునుంచి విద్యార్థుల కృత్యాలను పరిశీలించాడు. కేదారుడు ఒకగంట సేపు బోధన జరిపాక, ఎవరికి ఆసక్తి ఉన్న కార్యక్రమాన్ని వారు శ్రద్ధతో చేయసాగారు. సుమంతుడు విలువిద్యను అభ్యసిస్తుంటే, వసంతుడు చిత్రలేఖనంలో మునిగిపోయాడు. మధ్యాహ్నం వరకూ ఏకముఖుడు వారిని గమనించాడు. ఇంతలో కేదారుడు ఏకముఖుడిని గుర్తించాడు. సాదరంగా ఆహ్వానించి, ఆశ్రమం

శాఖమూరి శ్రీనివాస్

పక్కనే విరగకాసి మామిడిచెట్టు క్రింద మెత్తటి దుప్పటిపై కూర్చోబెట్టాడు.

'వసంతుడి పరిస్థితే అగమ్యగోచరంగా ఉంది. వీరత్వం లేకుంటే రాజ్యాన్ని పాలించేదెలా కాపాడుకునేదెలా తీవ్రనిరాశ కలుగుతోందని బాధపడ్డాడు ఏకముఖుడు.

'ప్రభూ.. అధికచింతన అనర్థదాయకం. ముందు మా ఆతిథ్యాన్ని స్వీకరించండి. తదుపరి వసంతుడి భవిష్యత్ పై చర్చిద్దాం అని చెప్పి, కేదారుడు శిష్యులను పురమాయించి భోజనఏర్పాట్లు చేశాడు. భోజనానంతరం తాజాగా నిగనిగలాడుతున్న మామిడిపండును రాజుకు అందించాడు.

దాని రుచి ఏకముఖుడిని మైమరిపించింది. ఆత్రంగా మరొక పండును కొరికిన ఏకముఖుడికి తీవ్రనిరాశ కలిగింది. ఆ పండు చాలా వగరుగా ఉండడంతో, దానిని కొరికిన వెంటనే రాజు ముఖంలో వచ్చిన మార్పును పసిగట్టిన కేదారుడు, 'చూశారా.. మీకిచ్చిన రెండుపళ్ళు కూడా ఈ మామిడి చెట్టువే! ఒక చెట్టుకే కాసినా రెండింటి రుచిలోగల తేడాను గుర్తించండి. మీ కుమారులు కూడా అంతే! ఎవరి ప్రత్యేకత వారిదే!

సృష్టిలోని ఏప్రాణి కూడా ఇతర ప్రాణుల కంటే ఎక్కువా, తక్కువా కాదు. దేని ప్రత్యేకత దానిదే! వసంతుడిని మీరు బలవంతంగా రాజును చేసినా.. ఆ రాజ్యపాలన సక్రమంగా సాగదు. ఆసక్తిలేని పని ఎన్నడూ సత్ఫలితాన్ని ఇవ్వదు. తనకు అభిరుచి ఉన్న విషయాల్లోనే ప్రోత్సహిస్తే పేరుప్రఖ్యాతులు పొందుతాడు. మీ మనసుకు కష్టమైనా, రాజ్యాన్ని పూర్తిగా సుమంతుడికే అప్పగించి మంచిరాజుగా ఎదిగేందుకు తోడ్పడండి,' అని పరిష్కారాన్ని సూచించాడు కేదారుడు.

రాజులో పరివర్తన కలిగింది. తన నిర్ణయం ప్రకారం నడుచుకోమని కుమారులను కోరడం మూర్ఖత్వమనిపించింది. మనుషుల్లో ఎవరి ప్రత్యేకత వారిదేనని గుర్తించాడు. పూర్తి స్వేచ్ఛతో, విద్యార్థుల అభిరుచికి తగినట్లు బోధన చేస్తున్న కేదారుడిని అభినందించి, సంతృప్తి చెందిన మనసుతో తిరిగివెళ్ళాడు.



# తగిన వరుడు

ఆదిశేషయ్య ఒక్కగానొక్క కూతురు మేధ వివాహం చేయదలిచి ఆమెతో ప్రస్తావించాడు. 'నాకు తగినవారు అనుకున్న ఓ ఇద్దరిని మీరే ఎంపిక చేయండి. వారిలో ఒకరిని తప్పక వివాహమాడతాను,' అన్నది మేధ. ఆదిశేషయ్య చుట్టుపక్కల గ్రామాలన్నీ గాలించి, సుజయుడు, అజయుడు అనే ఇద్దరిని ఎంపిక చేశాడు.

సుజయుడు తండ్రి తదనంతరం కూర్చుని తిన్నా తరగనంత సంపదకు వారసుడై సకల భోగభాగ్యాలను అనుభవిస్తూ కాలం గడుపుతున్నాడు. ఇక అజయుడు కళను నమ్ముకుని తను చిత్రించిన చిత్రపటాలను అమ్ముకోగా వచ్చిన డబ్బుతో జీవనం గడుపుతున్నాడు.

ఆదిశేషయ్య, కూతురితో 'సుజయుడు స్థితిమంతుడు. నీ జీవితం ఆనందంగా సాగిపోతుంది. నువ్వు ఊ అంటే అతడే నాకు కాబోయే అల్లుడు,' అన్నాడు.

మేధ తల అడ్డంగా ఊపుతూ, 'మీకు తగిన అల్లుడు అజయుడు నాన్నా,' అంది. 'సుజయుడు స్థితిమంతుడే అయినా కూర్చుని తింటే ఆ సంపద తరిగిపోవచ్చు. ఆపై ప్రయత్నించినా కష్టపడలేడు. దాంతో నా జీవితం ఇబ్బందుల్లో పడుతుంది.' అంది మేధ. 'అజయుడిని చేసుకుంటే మొదటినుండే కష్టాలు పడాల్సొస్తుంది కదా తల్లీ,' అన్నాడు ఆదిశేషయ్య.

'లేదు నాన్నా.. అజయుడు మంచి చిత్రకారుడు. తగు ప్రోత్సాహాన్నందిస్తే మరింత నేర్పుగా చిత్రించగలుగుతాడు. అతడి చిత్రాలకు మంచి గిరాకీ ఏర్పడుతుంది. దానితో డబ్బు కూడుతుంది. అంతే కాదు.. కళాకారుడు సున్నిత హృదయుడై ఉంటాడు. అతడు తన భార్యను కళా హృదయంతో ఆరాధిస్తాడే తప్ప ఎన్నడూ నొప్పించడు,' అంది మేధ.

ఆదిశేషయ్య కూతురి ఆలోచనా తీరుకు అబ్బురపడుతూ అజయుడినే అల్లుడుగా ఖాయం చేసుకున్నాడు.

– జొన్నకూటి మ్యార్టిన్ ఫిన్‌లె





# శిథిలాలయం - 29

(రాత్రివేళ శిఖిముఖీ వాళ్లను వృశ్చికలంక లోని ఆదిమవాసులు పట్టుకున్నారు. వాళ్ళ నాయకుడు చెప్పిన వెర్రి వెలగపండు కోసం నాంగ్ సోమ్ వెళ్లి, అక్కడ కాపలా ఉన్న వాణ్ణి పట్టుకుని, కాళ్లూ చేతులూ కట్టివేసాడు. వాడు పక్క నున్న బండరాయితో పాటు, శిఖిముఖీ వాళ్లు నిద్రపోతున్న కొండ దిగువకు దొర్లుకు రాసాగాడు.)

గుహలో నిద్రపోతున్న వృశ్చిక జాతి వాళ్ల నాయకుడికీ, గుహముందు కునికిపాట్లు పడుతున్న శిఖిముఖీ అతడి అనుచరులకూ, కొండపై నుంచి దొర్లుకు వస్తున్న బండరాయీ, కాపలావాడూ కలిసి చేసే పెద్ద ధ్వని భయం కలిగించింది. ఏదో పెను తాకిడికి కొండ శిఖరం తునాతునకలై కిందపడుతున్నదనుకున్నాడు శిఖిముఖి. అతడు గొంతెత్తి తన వాళ్లను హెచ్చరించే లోపలే, గుహలో నుంచి వృశ్చిక జాతివాళ్ల నాయకుడు మెరుపులా బయటకి వచ్చాడు.

'కొండ అంచు నుంచి దూరంగా పరిగెత్తండి. భూకంపం! భూకంపం!' అంటూ అరిచాడు వాడు. ఆ హెచ్చరిక వింటూనే అందరూ పారిపోబోయేంతలో, పెద్దపెద్ద ధ్వనులతో బండరాయీ, ఓ క్షణం ఆలస్యంగా కాపలా వాడూ కొండమీది నుంచి కింద బడ్డారు. అదృష్టవశాన బండరాయి మనుషులెవరూ లేని చోట పడింది. కాని కాపలావాడు మాత్రం కీచుమని అరుస్తూ తన జాతివాళ్లిద్దరి మీదా ధబీమంటూ పడిపోయాడు.

వృశ్చికజాతి నాయకుడు కిందపడి మూలుగుతున్న కాపలావాణ్ణి సమీపించి,

దాసరి సుబ్రహ్మణ్యం



'ఇదేవిటి? కాళ్ళూ చేతులూ కట్టుకు న్నావేం?' అని ప్రశ్నించాడు.

వాడు తడబడుతూ లేచి నిలబడి, 'మనం పట్టుకున్న ఈ ఇభ్యుజాతి వాళ్లలో ఒకడు నేను కాపలా కాసే చోటుకు వచ్చి, దొంగదెబ్బ తీసి నా కాళ్లూ చేతులూ కట్టివే శాడు. ఈ సంగతి చెప్పేందుకు నేను కొండ మీది నుంచి దొర్లి వచ్చాను,' అన్నాడు.

ఈ మాటలు వృశ్చిక నాయకుణ్ణి, శిఖి ముఖీ, విక్రమకేసరుల్ని కూడా ఆశ్చర్య పరిచినై. శిఖిముఖి తన అనుచరుల కేసి చూసి, వాళ్లలో నాంగ్‌సోమ్ లేడని తెలుసు కున్నాడు. అతడు విక్రమకేసరితో ఈ సంగతి చెప్పబోయేంతలో వృశ్చిక నాయ కుడు గడగడ వణికిపోతూ, 'మీలో ఒకడు రహస్యంగా ఆ వెర్రివెలగపళ్లకోసం వెళ్లాడు. ఒకవేళ దుస్సాహసం కొద్దీ వాడా పండు తిన్నాడో, చాలా చిక్కుల్లో పడిపోతాడు. ఇప్పుడేం చేయటం?' అన్నాడు.

'అలా అయితే మనం త్వరగా పోయి నాంగ్‌సోమ్ ఆ వెలగపండు తినకుండా ఆపే ప్రయత్నం చేద్దాం. ఇంతకీ ఆ పండు తింటే రాబోయే ప్రమాదం ఏమిటి?' అన్నాడు శిఖిముఖి.

''వృశ్చిక జాతి వాళ్ల నాయకుడు తప్ప మరెవ్వడూ ఆ వెర్రివెలగపండు తిని నిభా యించుకోలేరు. ఆ మధ్య నాకు పట్టుబడ్డ శిఖవాడికి 'వాడు పెట్టుకున్న పేరు శిథిలా లయ పూజారి కామాలు' వాడి చేత ఆ పండు తినిపించి, నిజం మాట్లాడేటట్టు చేద్దామనుకున్నాను,'' అన్నాడు వృశ్చిక నాయకుడు.

శిఖిముఖి వృశ్చిక నాయకుడితో, 'నాంగ్ సోమ్ ఎవర్నీ మోసగించి వెర్రి వెలగపండు కోసం వెళ్లలేదు. అతడికి ఈ మధ్య, ఈ ప్రాంతాల గాలీ నీరూ పడక మనస్థిమితం కాస్త తప్పింది. మనం మనం మిత్రులం. శిథిలాలయం ఎక్కడుందో కనుక్కోవటంలో నీకు అన్ని విధాలా సాయపడగలం. ముందు నాంగ్‌సోమ్ ఎక్కడున్నాడో వెతికి పట్టుకుందాం పదండి,' అన్నాడు.

'నాంగ్‌సోమ్ వెర్రి వెలగపండు తిని ఉంటే అతడిని తప్పక వృశ్చికమాతకు బలి ఇస్తాన'ని వృశ్చిక నాయకుడు తన వాళ్లతో

చెప్పి, శిఖిముఖీ వాళ్లతో, 'పదండి, పండు తిని మీ వాడు తన ప్రాణం మీదికి తెచ్చు కోకముందే వెళ్ళి పట్టుకుందాం,' అన్నాడు గాభరాగా.

అందరూ వృశ్చిక నాయకుడి వెంట వెర్రివెలగపండు చెట్లున్న కొలను కేసి బయలుదేరారు. కాని, ఈ లోపలే నాంగ్ సోమ్ వెలగచెట్టెక్కి ఒక పండు కోసుకుని తిన్నాడు. అది తిన్న కొద్ది క్షణాలకల్లా అతడికి ఏదో మైకం కమ్మినట్లయిపో యింది. తాను నిలబడ్డ భూమీ, చెట్టు చేమలూ, కొండలూ అన్నీ గిర్రున తిరిగి పోతున్నట్లు తోచింది.

'నేను తిన్నది వెర్రివెలగపండు! నాకేదో వెర్రెత్తుతున్నట్లున్నది. ఈ వెర్రితోగాని భూగర్భంలో ఉన్న శిథిలాలయం కనుక్కో లేనేమో! అసలు శిథిలాలయం, వృశ్చిక మాత మందిరం ఒకటేనా? ఒకటే! అదుగో శిథిలాలయం! అదుగో వృశ్చికమాత మందిరం!' అంటూ నాంగ్ సోమ్ తల పీక్కుని, అరుస్తూ కొండదార్లవెంట పరిగెత్త సాగాడు.

అతణ్ణి పట్టుకునేందుకు బయలు దేరిన శిఖిముఖీ వాళ్లకు అతడు చెట్లలో నుంచీ అరిచే అరుపులు తప్ప మనిషి మాత్రం ఎక్కడా కనిపించలేదు. ధ్వని వచ్చిన దిక్కుగా వాళ్లు సూర్యోదయం అయే వరకు అతడి కోసం తీవ్రంగా గాలించి, బాగా అలిసిపోయి, చివరకు ఒక కొండ




అంచున ఉన్న చెట్లకింద కూలబడ్డారు.

వెర్రివెలగపండు చెట్లున్న కొలనుకు ఆవల ఉన్న అరణ్యంలో వృశ్చికజాతి వాళ్ల కాపుదలలో ఉన్న శిథిలాలయ పూజారికి, నాంగ్‌సోమ్ పిచ్చిగా వేసే కేకలు, ఆ రాత్రి వేళే వినిపించినై. అతడు తన అనుచరులైన సవర భేరుండాన్నీ, తతిమ్మావాళ్లనూ హెచ్చ రించి, వృశ్చికజాతి కాపలా వాళ్లతో, ఆ కేకలు పెట్టేవాడు వృశ్చికమాత మహా భక్తు డనీ, అతణ్ణి అనుసరించి పోతే మాతమం దిరం కనబడుతుందనీ నమ్మబలికాడు.

మాయమర్మాలు అంతగా ఎరగని వృశ్చిక జాతివాళ్లు, శిథిలాలయ పూజారి వెంట నాంగ్‌సోమ్ కోసం బయలుదేరారు. తూర్పు తెలతెలవారుతుండగా వాళ్లకు ఒక




గుహముందు నాంగ్‌సోమ్ కనిపించాడు. గుహాముఖం చిక్కని సాలెగూటితో కప్పబడి ఉన్నది. అందులో ఒక రాక్షసితేలు చిక్కుకుని బయట పడేందుకు నానా ప్రయాసా పడుతున్నది. నాంగ్‌సోమ్ ఆ సాలెగూటి ముందు కత్తి పట్టుకుని అటూ ఇటూ గెంతుతూ, 'రక్షించండి! రక్షించండి! భయంకర జలజంతువు నన్ను మింగబోతున్నది!' అంటూ అరుస్తున్నాడు.

ఆ అరుపులూ, నాంగ్‌సోమ్ భయంతో వణికిపోతున్న తీరూ చూసి, శిథిలాలయ పూజారి అతడికి వెర్రి వెలగపండు తిన్న కారణంగా మతి స్థిమితం తప్పిందని గ్రహించాడు. వృశ్చికజాతి వాళ్లు నమ్ముతున్నట్లు బహుశా ఆ స్థితిలోనే అతడు నిజమైన శిథిలాలయం ఎక్కడ ఉన్నదో కనుక్కోవచ్చన్న నమ్మకం కూడా అతడికి కలిగింది.

పూజారి అతణ్ణి సమీపించి, 'నువ్వు ఇభ్యుజాతి వాడివి కాదా? నిన్ను గోల్‌భరా గ్రామంలో చూశాను. నీ పేరు నాంగ్‌సోమ్, అవునా?' అని ప్రశ్నించాడు.

నాంగ్‌సోమ్ ఆ మాటలు వింటూనే ఉలిక్కిపడి వెనక్కు తిరిగి, 'నెత్తిమీద శిఖతో ఇక్కడ అవతరించిన మహానుభావులు మీరెవరు? సిద్ధుల్లా ఉన్నారు. నన్ను ఈ ఖడ్గమృగం నుంచి కాపాడాలి,' అంటూ పూజారికి సాష్టాంగపడ్డాడు.

పూజారి అతణ్ణి భుజాలు పట్టుకుని లేపి నిలుచోబెట్టి, 'అది ఖడ్గమృగం కాదు. రెండు తలల గంధభేరుండం. ఒక్క క్షణంలో చంపేయిస్తాను,' అంటూ పక్కనున్న సవర భేరుండంతో, 'భేరుండం! ఆ పిశాచిని నరుకు,' అన్నాడు.

ఆ వెంటనే భేరుండం కత్తితో తేలును బలంగా కొట్టాడు. అది రెండుగా తెగిపోయి, రక్తంతో సాలెగూడు తడిసిపోయింది. నాంగ్‌సోమ్ ఆ నెత్తురు చూస్తూనే వణుకుతూ పూజారి పాదాలు పట్టుకుని, 'మహా సిద్ధులు నన్ను రక్షించాలి! నెత్తుటి ప్రవాహంలో కొట్టుకుపోతున్నాను. ఈత రాదు!' అన్నాడు.

శిథిలాలయ పూజారి అతడికి అభయం ఇస్తున్న వాడిలా చేతిని తల మీద పెట్టి,




'నీకొచ్చిన భయం ఏమీ లేదు. రక్తపుటేరును, సెలయేటి జాలుగా మార్చాను. నువ్వు దాని వెంట బయలుదేరి భూగర్భంలో శిథిలాలయం ఉన్న చోటు చేరు,' అన్నాడు.

'గురుసిద్ధా, తమ ఆజ్ఞ!' అంటూ నాంగ్‌సోమ్ అక్కణ్ణుంచి కదిలి వేగంగా నడవసాగాడు.

శిథిలాలయ పూజారి తన బంట్లతో, 'బల్లి తోక పట్టుకుని బ్రహ్మపుత్రానది ఈదజూసినట్లుంది మన పని! అయితే ఏ పుట్టలో ఏ పాముందో చెప్పలేం. వీడి వెర్రి మనను శిథిలాలయం చేర్చినా చేర్చవచ్చు. వీడు పారిపోకుండా జాగ్రత్తపడాలి,' అని చెప్పి నాంగ్‌సోమ్ వెంట నడవసాగాడు.

నాంగ్‌సోమ్ వాళ్లను ఆ చుట్టుపక్కల గల గుట్టల్లో, చెట్లల్లో నానా గిరికీలూ కొట్టించాడు. వెర్రి వెలగపండు విషం అతడి మస్తిష్కాన్ని బాగా వశపరుచుకున్నది. అతడికి ప్రతి చిన్న ప్రాణీ ఏనుగంత ఆకారంలో భయంకరంగా కనబడసాగింది. అలాంటి సమయాల్లో అతడు పెద్దగా 'గురుసిద్ధా, నీవే రక్ష!' అంటూ కేకలు పెట్టసాగాడు.

మిట్టమధ్యాహ్నం వేళకు నాంగ్‌సోమ్ అందర్నీ ఒక ఎత్తయిన పర్వతం మీదికి చేర్చాడు. దిగువను ఒక చిన్న లోయ ఉన్నది. ఆ లోయలో చాలా ఎత్తుగా గుబురుగా పెరిగి వటవృక్షాలు అసంఖ్యాకంగా ఉన్నవి.

నాంగ్‌లోయకేసి ఓ మారు చూసి జుట్టు గట్టిగా పీక్కుని, 'గురుసిద్ధా! శిథిలాలయం ఆ అగాథంలో ఉన్నది. ఎంత బగారం! ఎన్ని మణిమాణిక్యాలు! ఆలయం మీది కలశం.. అదుగో మెరుస్తున్నది!' అన్నాడు. శిథిలాలయ పూజారి లోయలోకి తొంగి చూశాడు. నాంగ్‌సోమ్ చెప్పినవేమీ అతడికి కనిపించలేదు. పెద్ద పెద్ద ఊడలు దించుకున్న వటవృక్షాలు మాత్రం అతడి కంట బడినై.

'ఇది వెర్రివాగుడు! వెధవ మనల్ని గుట్టలూ పుట్టలూ తిప్పి నానా హైరానా పెట్టాడు. లోయలోకి తోసేస్తే సుఖపడి పోతాం,' అన్నాడు శిథిలాలయ పూజారి.

ఆ మాట వింటూనే సవరభేరుండం ముందుకు వచ్చి, 'గురుప్రభో! శాల్తీని ఉన్నపళంగా తోయమన్నారా, ముక్కలుగా నరికి విసరమన్నారా?' అన్నాడు.

మరుక్షణం వృశ్చికజాతివాళ్లలో కల కలం లేచింది. వాళ్లు రాతి గొడ్డళ్లను పైకెత్తి ముందుకు వచ్చి, 'ఈ ఇభ్యుజాతి వాడికి ఎలాంటి హానీ జరగ్గూడదు. అతడు వృశ్చికమాత గణాచారి. అతడు చెప్పినట్లు ఆ లోయలో వృశ్చికమాత మందిరం ఉన్న దేమో ఎవరు చూశారు!' అన్నారు.

పూజారి ఏదో అనబోయేంతలో సవర భేరుండం చేతులు ఊపుతూ, 'అదీ నిజమే, గురుప్రభో! అలా గాల్లోకి ఎగిరి లోయలో వాలమన్నారా?' అన్నాడు.

శిథిలాలయ పూజారి అతణ్ణి గట్టిగా కసిరి, 'నువ్వు మళ్లీ అతిగా తాగటం మొదలు పెట్టినట్టుంది. జాగర్త. కొండ ముచ్చుగా మార్చి, ఇక్కడి చెట్లమీద వదిలి పోతాను,' అన్నాడు.

'గురుప్రభో! అలా చేయకండి. కొండ ముచ్చులు కొండల్లో తప్ప చెట్లమీద బతకటం...'

సవరభేరుండ మాట పూర్తి చేసే లోపలే పూజారి కీచుమంటూ ఒక్క ఎగురెగిరి, 'అదె వచ్చె వచ్చె! శబర శుంఠ శిఖిముఖీ వాడి దండూ!' అన్నాడు.

శిఖిముఖి కొండమీదికి వస్తూనే, 'నాంగ్ సోమ్‌ను కొండ అంచునుంచి ఇవతలికి



లాగండి,' అని శిథిలాలయ పూజారిని చూసి, గట్టిగా 'దుర్మార్గుడా, ఇంతకాలా నికి దొరికావ్! పారిపోవాలని చూశావో వీపులో కత్తో బాణమో గుచ్చుకుంటుంది జాగ్రత్త!' అన్నాడు.

ఎలా పారిపోవటమా అని ఆలోచిస్తున్న పూజారికి, శిఖిముఖి మాటలతో ఒక ఉపాయం తోచింది. అతడు చప్పున ముందుకు దూకి నాంగ్‌సోమ్‌ను భుజాన వేసుకుని, కొండ అంచునే పరిగెత్తుతూ ఇరుకు రాళ్లమధ్య జొరబడ్డాడు.

పాము బారి నుంచి తప్పుకుని పులి నోట పడినట్టయింది పూజారి పని. అటు వైపు నుంచి కుంటుతూ వస్తున్న జాంగ్‌లా ఒక్క గావుకేక పెట్టి, 'పాపాత్ముడా! ఇక

నువ్వు ప్రాణాలతో పారిపోలేవు!' అంటూ అతడి మీదికి ఉరికాడు.

శిథిలాలయ పూజారి, నాంగ్‌సోమ్‌ను భుజం మీదినుంచి కిందికి జార్చి, మొలన వేలాడుతున్న చురకత్తితో జాంగ్‌లా గుండెలకు గురిచేసి పొడవచూశాడు. అంతలో జాంగ్‌లా వచ్చి మీద పడటంతో కత్తి గురి తప్పి అతడి భుజంలో గుచ్చుకుంది.

జాంగ్‌లా అంత బలమైన కత్తిపోటనూ లెక్క చేయకుండా పూజారి మెడ పట్టుకోబోయాడు. కాని, పూజారి తల పక్కకు తిప్పి కొండ అంచుకు ఒరిగి పోవడంతో, అతడి నెత్తిమీది శిఖ మాత్రమే జాంగ్‌లా చేతికి దొరికింది.

జాంగ్‌లాకు తగిలిన గాయం నుంచి రక్తం ధారగా కారుతున్నది. కాని, అతడు పూజారి శిఖ వదలకుండా గట్టిగా పట్టుకుని కొండ మీదికి లాగేందుకు ప్రయత్నిస్తున్నాడు. పూజారి తాను కింది లోయలో పడిపోతానన్న భయంతో వణికిపోతూ గిల గిల తన్నుకుంటున్నాడు.

ఆ పరిస్థితుల్లో శిఖిముఖి అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, 'జాంగ్‌లా, నీ స్వామి భక్తి మెచ్చదగింది. సవరగండు పోతు కూతురు నాగుమల్లి, వీడి శిఖ కావాలన్నది!' అంటూ కత్తితో శిథిలాలయ పూజారి శిఖ మొదటి కంటా కోశాడు. మరుక్షణం శిథిలాలయ పూజారి ఒక్క చావుకేక పెట్టి లోయలోకి పడిపోయాడు.

ఆ క్షణం వరకూ నాంగ్‌సోమ్ ఏం చేస్తున్నదీ ఎవరూ గమనించలేదు. అతడు లోయలోని మహా వటవృక్షాల కేసి కన్నార్పకుండా చూడసాగాడు. అతడికి శిథిలాలయ పూజారి పెట్టిన చావుకేక వినిపించింది. ఆ వెంటనే నాంగ్‌సోమ్, 'అదుగో, శిథిలాలయం!' అని అరిచి లోయలోని వటవృక్షాల కేసి దూకేశాడు.

- (ఇంకా ఉంది)



# అమాయకురాలు!

కొత్తగా కాపరానికి వచ్చిన ఒక అమ్మాయికి జీడిపప్పు అంటే చాలా ఇష్టం. అత్తగారు చూడకుండా అటు వచ్చీ, ఇటు వచ్చీ ఒక్కొక్క పలుకు నోట్లో వేసుకుంటూ ఉండేది.

కొన్నాళ్లయ్యాక అత్తగారికి అనుమానం కలిగింది. ముంతలో జీడిపప్పు తరిగిపోయిందని. అనుమానించడానికి కోడలు తప్ప ఇంకెవరున్నారూ?

అత్త తన దొంగతనం పసిగట్టిందని కోడలు పిల్ల కనిపెట్టింది. ఒకనాడామె ఇల్లు ఊడుస్తూ నేలమీద పడి ఉన్న జీడిబద్ద ఎత్తి, దానికేసి వింతగా చూసి, 'ఇదేం పప్పు, అత్తయ్యా?' అని అడిగింది.

'అయ్యో, పాపం. ఆ పిచ్చిపిల్లకు జీడిపప్పు మొహమే తెలీదు. నేను దాన్ని అనుమానించాను!' అని అత్తగారు పశ్చాత్తాపపడింది.





# జ్యోతిషం

తాతయ్య నిండు వెన్నెలలో పడకకుర్చీ వాల్చి కూచుని, పొడుంకాయలో నుంచి ఎడమచేతిలోకి పొడుం వేసుకుంటూ ఒక శ్లోకం చదివాడు:

మంత్రః కార్యానుగో యేషాం,
కార్యం స్వామి హితానుగం;
త ఏవ మంత్రిణో రాజ్ఞాం
నతు యే గత పల్లవాః.

తాతయ్య చుట్టూ కూచున్న పిల్లలు, 'అదేం శ్లోకం తాతయ్యా? దాని అర్థమేమిటి?' అని అడిగారు.

తాతయ్య తాపీగా కుడిచేతి వేళ్లతో పొడుం పట్టు పట్టి పీల్చి, చెయ్యి విదిలిస్తూ, 'ఆ శ్లోకానికి అర్థం ఏమిటంటారా? చెబుతా వినండి. మంత్రి అయినటువంటివాడు రాజుకు అనుకూలంగా ఉండి కార్యసాధన చెయ్యాలి గాని, అలా చేయలేనివాడు మంత్రే కాదు,' అని దాని అర్థం అన్నాడు.

'ఏ రాజు తాతయ్యా?.. మంత్రి ఎవరు తాతయ్యా చెప్పవూ? ఆ కథ చెప్పు తాతయ్యా!' అని పిల్లలు తలా ఒక మాటా అడిగారు.

'కథ చెప్పమనా మీరనేది? దానికేం? చెబుతా వినండి,' అంటూ తాతయ్య ఈ కథ చెప్పాడు.

పూర్వం చక్రపురాన్ని సుదర్శన మహారాజు అనే ఆయన పాలించేవాడు. ఆయనకు బుద్ధి సింధుడనే జ్ఞానమంతుడు మంత్రిగా ఉండేవాడు. ఈ మంత్రి ఉన్నాడే... అతడు బహుగొప్ప బుద్ధిశాలి. అందుకే ఆయనను రాజుతో పాటు రాజ్యంలోని ప్రజలందరూ కూడా ఎంతగానో మెచ్చుకునేవారు.

సి. శేషాద్రి

రాజుగారికి మటుకు ఒకవెర్రి ఉండేది. ఆయన అడ్డమైన జ్యోతిష్కులనూ పిలిచి భవిష్యత్తు తెలుసుకుంటూ ఉండేవాడు. ఇలా ఉండగా రాజుగారి కొలువుకు ఒక జ్యోతిష్కుడు వచ్చి తన శక్తి గురించి రాజుగారికి గొప్పగా చెప్పుకున్నాడు. రాజుగారికి అతగాడిలో గురి కుదిరింది. ఆయన ఆ జ్యోతిష్కుడికి తన చక్రం చూపించి, 'అయ్యా, నా ఆయుర్దాయం ఇంకా ఎంత ఉంది?' అని అడిగాడు.

దానికా జ్యోతిష్కుడు, 'మహారాజా, ఈనాటినుంచి మరి ఆరుమాసాలతో మీ ఆయువు తీరిపోతుంది. నా దగ్గిర దాపరికం లేదు,' అనేశాడు.

దాంతో రాజుగారికి మనోవ్యాధి పట్టుకుంది. ఆయన నిద్రాహారాలు మానేసి, మంచాన పడి అయ్యో, మరో ఆరుమాసాలతో నాకు కాలం తీరిపోతుందే! అని బెంగతో కృశించసాగాడు.

ఇదంతా చూస్తున్న మంత్రికి జ్యోతిష్కుడి పైన కోపం వచ్చింది. ఆయన రాజుగారితో, 'మహారాజా, మీరీ జ్యోతిష్కులను నమ్మకండి. వసిష్ఠుడంతటివాడు శ్రీరాముడి పట్టాభిషేకానికి ముహూర్తం పెడితే ఏమయింది? అదే ముహూర్తానికి రాముడు వనవాసం బయలుదేరటమే గాక తన భార్యను పోగొట్టుకున్నాడు గద!' అన్నాడు.

కాని రాజు మనోవ్యాధి నిమ్మళించలేదు. అప్పుడు మంత్రి ఏం చేశాడనుకున్నారు? జ్యోతిష్కుణ్ణి పిలిపించి, 'ఏమయ్యా, రాజుగారి ఆయుఃప్రమాణం చెప్పావు గదా, మరి నీ ఆయుఃప్రమాణం మాట ఏమిటి?' అని అడిగాడు.

'చిత్తం, నేనింకా నలభై ఏళ్లు బతుకుతాను!' అన్నాడు జ్యోతిష్కుడు.

'అలాగా?' అంటూ మంత్రి ఆ జ్యోతిష్కుడికి అప్పటికప్పుడే మరణదండన విధించి శిరచ్ఛేదం చేయించాడు.

ఆ దెబ్బతో రాజుగారికి మనోవ్యాధి పోయింది. దాంతోపాటు జ్యోతిషం పిచ్చి కూడా పోయింది. ఆయన చాలాకాలం సుఖంగా రాజ్యం చేశాడు.



# పోయేదేమీ లేదు

ఒకానొక రాజ్యంలో ఒక నిరుపేద ఉండేవాడు. వేరొక రాజ్యంలో బతకాలనే ఉద్దేశంతో అతడు అయిదువందల బళ్లు కలిగిన అతిపెద్ద బిడారుతో జతకలిశాడు. ఒక రాత్రి వేళ బిడారు అడివిలో మజిలీ వేసింది. అందరూ నిద్రపోయారు కాని ఈ పేదవాడు మాత్రం మజిలీ చేసిన శిబిరం వెలుపల నిద్రపోకుండా కూచుండిపోయాడు.

మలిజామున కొంతమంది దారిదోపిడీ దొంగలు ఈ శిబిరాన్ని కొల్లగొట్టే ఉద్దేశంతో అక్కడికి వచ్చారు. కాని పేదవాడు మేలుకుని ఉండటంతో వాళ్లు వెనుదిరిగారు. వాళ్లు మరో రెండు సార్లు ప్రయత్నించారు కాని అప్పటికీ పేదవాడు నిద్రపోకుండా మేలుకునే ఉన్నాడు. చివరికి తెల్లవారుజామున వారు చివరిసారిగా అక్కడికి వచ్చి ఆ మనిషి ఇంకా మేలుకుని ఉండటం చూశారు. తమ చేతుల్లో ఉన్న కర్రలు, రాళ్లు వారు విసిరి వేసి, 'ఈ మనిషి ఇవ్వాళ మిమ్మల్ని మానుంచి కాపాడాడు. ఇతడ్ని బాగా చూసుకోండి,' అంటూ అరుస్తూ అక్కడి నుంచి వెళ్లిపోయారు.

దాంతో ఇతర ప్రయాణీకులు మేల్కొన్నారు. శిబిరం బయట కర్రలు, రాళ్లు పడి ఉండటం చూసి, 'రాత్రి వేళ దొంగలేమైనా వచ్చారా!' అని నిరుపేదను అడిగారు. 'దొంగలను చూసి నీకు భయం వేయలేదా?' అని ప్రశ్నించారు.

'దొంగలను చూసి నేనెందుకు భయపడాలి?' అన్నాడా నిరుపేద. 'పోగొట్టుకోవడానికి నా దగ్గర ఏమయినా ఉంటే కదా!'





# జీవితంలో తృప్తి

మాధవపురంలో వీరయ్య, సూరయ్య అనే మిత్రులు ఉండేవారు. వారు ఒకే వయస్సు వారు కావడం వల్ల ఒకే తరగతిలో చదివే వారు. ప్రాథమిక విద్య వారి గ్రామంలోనే అభ్యసించారు. మాధ్యమిక విద్య పొరుగూరు సీతారాంపురంలో, ఉన్నత విద్య దూరంగా ఉన్న హేళాపురి పట్టణంలో అభ్యసించారు.

వీరయ్య రైతుబిడ్డ. ఉన్నత విద్య అభ్యసించి కూడా తమ గ్రామానికే పరిమితమై వ్యవసాయం చేసుకునేవాడు. తమ పొలాలు దున్నుకుంటూ వచ్చిన ఫలసాయం తోటే గుట్టుగా సంసారాన్ని ఈదుతున్నాడు.

సూరయ్య వ్యాపార కుటుంబానికి చెందిన వాడు. తండ్రి చేస్తున్న వ్యాపారాల్లో మెలకువలు గ్రహించి, సాటి వ్యాపారుల ఆలోచనలు ఊహించి, అంతకంటే మెరుగైన ఆలోచనలతో వ్యాపారంలో ముందుకు దూసుకుపోతున్నాడు. మొదట చుట్టు ప్రక్కల పల్లెటూళ్లకే పరిమితమైన అతడి వ్యాపారం లాభసాటిగా ఉండటంతో రాజధాని నగరం వరకు వ్యాపించింది.

వారిద్దరూ ఉన్నత విద్యను అభ్యసించినప్పటికీ వారి వారి వారసత్వ వృత్తులలోనే స్థిరపడ్డారు. ఇది తెలిసి వారికి విద్య నేర్పిన గురువులు బాధపడ్డారు. 'మీలాంటి మంచి తెలివితేటలున్న విద్యార్థులకు రాజాస్థానంలో గొప్ప నౌకరీ దొరికి ఉండేది. మీరు చదువును, తెలివిని వృధా చేస్తున్నారు,' అనేవారు.

దానికి సూరయ్య, వీరయ్య 'మాకు మా పూర్వకాలం నుండి వస్తున్న వృత్తుల మీద అభిమానం ఎక్కువ. వీటిని సమర్థ

నారంశెట్టి ఉమామహేశ్వరరావు



వంతంగా నిర్వహించగలమన్న నమ్మకం మాకుంది.అందుకే మేము రాజాస్థానంలో ప్రయత్నించలేదు,' అని చెప్పేశారు.

సూరయ్య, వీరయ్య ఎప్పటికప్పుడు కలుసుకుంటూ క్షేమసమాచారాలు విచారిస్తూ ఉండేవారు. వీరయ్య తరచూ తనకు ఏ లోటూ లేదనీ, ఉన్నదానితోనే తృప్తిగా ఉన్నానని చెప్పేవాడు.

అప్పుడు సూరయ్య 'మిత్రమా, మీ భూములు రెండు మూడెకరాలు మాత్రమే కదా! వేరేవారివి కౌలు తీసుకుని వ్యవసాయం చేయవచ్చు కదా! పెట్టుబడి అవసరమయితే అప్పుగా ఇస్తాను. ఏదైనా సాయం కావాలంటే అడుగు,' అని సలహా ఇచ్చేవాడు.

దానికి వీరయ్య 'నాకు ఉన్న భూమితో వ్యవసాయం చేసుకుంటూ సుఖంగా జీవిస్తున్నాను. అత్యాశతో వేరే భూములు కౌలుకి తీసుకుని వ్యవసాయం చేసే ఆలోచన లేదు,' అనేవాడు.

కాలచక్రంలో పదేళ్లు గడిచిపోయాయి. వీరయ్యకి ఇద్దరు అమ్మాయిలు కలిగారు, వారి చదువులు, తిండికి, బట్టలకు బోలెడు డబ్బు అవసరమయ్యేది. అలాంటి సమయంలో కూడా ఉన్నదాంట్లోనే సర్దుకుపోతూ గడిపేవాడు.

మరోపక్క సూరయ్య వ్యాపారంలో పోటీలేని స్థాయికి ఎదిగాడు. చాలా వ్యాపారాలు నిర్వహిస్తూ సమాజంలో గొప్పవాడిగా పేరు గడించాడు.

ఒకసారి సూరయ్య చిన్ననాటి మిత్రుడి ఇంట్లో శుభకార్యం ఉండి మాధవపురం వచ్చాడు. అనంతరం వీరయ్య ఇంటికి వెళ్లి మిత్రుడి కుటుంబ సభ్యులను కలిసి క్షేమసమాచారాలు విచారించాడు.

సూరయ్య ముఖ్యంగా గమనించినది ఏమిటంటే వీరయ్య ఆర్థికంగా ఎదగలేదని. తన చిన్ననాడు వారి ఇల్లు, పొలాలు, పశుసంపద ఎలా ఉండేదో ఇప్పుడూ అలాగే ఉంది. ఏమాత్రం ఎదుగుదల లేదు. అందుకు కొంత కలత చెందాడు.

సూరయ్య మిత్రుడిని పిలిచి 'నీ పిల్లలు, నీవూ తృప్తిగా భోజనం చేస్తున్నారా? మంచి చదువులు చదివిస్తున్నావా?' అని అడిగాడు.

దానికి వీరయ్య 'నాకున్నంతలో తృప్తిగా బతుకుతున్నాము. నా స్తోమతుకు తగ్గ

చదువు చదివిస్తున్నాను. నాకు ఏ విష యంలోనూ అసంతృప్తి లేదు. ఆనందంగా ఉన్నాను,' అని జవాబిచ్చాడు.

అప్పుడు సూరయ్య పకపకా నవ్వి, 'చాలా తెలివిగా సమాధానం చెప్పావు కదూ!' అన్నాడు.

వీరయ్య తడబడుతూ, 'ఇందులో తెలివేం ఉంది. ఉన్నది ఉన్నట్లుగా చెప్పాను,' అన్నాడు.

దానికి సూరయ్య 'మిత్రమా, నీవెంత తెలివైనవాడవో, చురుకైనవాడవో నాకు తెలుసు. నీవు మొదటినుండి ఉన్నదాంతో తృప్తిపడటం అలవాటు చేసుకున్నావు. అదే నీవు చేసిన పొరపాటు. నీవు నాతోనే జీవితం ప్రారంభించావు. జీవితంలో ఎదుగుదల సాధించాల్సిన వయసులో తృప్తిపడటం తప్పుగానీ, గొప్పవారు కావాలనుకోవడం, సంపద పెంచుకోవాలనుకోవడం తప్పు కాదు. ఒకప్పటి నీ ఆస్తి మీ భార్యా భర్తలకు సరిపోతుంది. పిల్లలు కలిగాక వారి ఖర్చులు తట్టుకోగలిగేలా సంపాదన పెంచుకోవాలి. కాని నీవు అప్పుడు కూడ తృప్తి పడటం అలవాటు చేసుకున్నావు. అందుకే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న సామెతలాగా ఎదుగూ బొదుగూ లేని సంసారం నడుపుతున్నావు. రైతు పదిమంది కోసం వ్యవసాయం చేసి పంట పండించి కడుపు నింపేవాడు. అతడు ఆశపడ కూడదని, ఆశయాలు ఉండకూడదని ఎక్కడా ఎవ్వరూ చెప్పలేదు. ఎప్పుడైతే మనిషి తృప్తి పడటం అలవాటు చేసుకుంటాడో అప్పుడే అతడి జీవితంలో అభివృద్ధి ఆగిపోతుంది. అందుకని తప్పుడు మార్గాలను వెతకకుండా, మంచి దారిలోనే వెళుతూ నిరంతరం కృషి చేయాలి. అప్పుడే ఉన్నత స్థితికి చేరగలుగుతాము,' అని సుదీర్ఘంగా జవాబిచ్చాడు.

వీరయ్యకి తాను ఎక్కడ పొరపాటు చేశాడో బోధపడింది. ఆ తర్వాత మిత్రుడి సాయంతో ఎక్కువ భూమి సేద్యం చేస్తూ ఎక్కువ ఆదాయం సంపాదిస్తూ తర్వాత కాలంలో మెరుగైన జీవితం గడిపాడు.





# పంజరం చిలుక

కృష్ణాపురం జమీందారు దివాణంలో గుమాస్తాగా పని చేస్తూన్న రామచంద్రయ్యకు భార్య, ఇద్దరు పిల్లలు ఉన్నారు. భార్య పేరు జానకి. పదేళ్ళ కొడుకు పేరు మురళి. కూతురు లక్ష్మికి ఏడేళ్ళు. రామచంద్రయ్య రోజూ పని నుంచి తిరిగొచ్చేటప్పుడు పిల్లలకు తినుబండారాలు గాని, ఆటవస్తువులు గాని కొని తెచ్చేవాడు.

ఒకనాడు రామచంద్రయ్య, భార్యాపిల్లలను వెంటబెట్టుకుని అత్తగారి ఊరైన నీలకంఠాపురంలో జరిగే తిరునాళ్ళకు బయలుదేరాడు. వాళ్ళు మార్గమధ్యంలో ఒక మామిడితోటలో కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. అప్పుడు ఆ తోటలోని పక్షులు, ముఖ్యంగా చిలుకల కిలకిలారావాలు పిల్లలను ఎంతగానో ఆనంద పరిచాయి. మరునాడు సాయంకాలం, తిరునాళ్ళు చూడడానికి తండ్రి వెంట వెళ్ళిన మురళికి చిలుకజోస్యం చెప్పేవాడొకడు కనిపించాడు. గూటిలో నుంచి, జోస్యుడు చెప్పగానే పంచవన్నెల రామచిలుక బుల్లి బుల్లి నడకలతో బయటికి వచ్చి, ఒక చీటీ తీసి అతని చేతికి ఇచ్చి, అతడిచ్చే సెనగగింజను అందుకుని లోపలికి వెళ్ళడం చూసిన మురళి ఎంతగానో మురిసిపోయాడు. తనకూ అలాంటి చిలుక ఒకటి కావాలని తండ్రిని అడిగాడు.

'స్వేచ్ఛగా తిరిగే చిలుకను పట్టి బంధించడం చాలా తప్పు. దాని స్వేచ్ఛను హరించరాదు,' అని తండ్రి ఎంత చెప్పినా వాడు వినిపించుకోలేదు. తెచ్చితీరాలని పట్టుబట్టాడు. ఇంటికి తిరిగి వచ్చిన మరునాడు సాయంకాలం తండ్రి తెచ్చి ఇచ్చిన చిలుకను చూసి ఎంతో సంబర పడిపోయాడు.

ఎస్. అరుల్ బాలమురుగన్

రోజంతా దానితోనే గడపసాగాడు.

మురళికి ఉన్నట్టుండి జ్వరం వచ్చి, మూడు రోజులు లేవలేక పోయాడు. తల్లి దండ్రులు వైద్యుడి వద్దకు తీసుకువెళ్ళారు. వైద్య పరీక్షలు చేసిన వైద్యుడు ఇది ఒక రకమైన విషజ్వరమనీ, మందులు వాడ్డంతో పాటు, రెండు వారాలు మంచం నుంచి కిందికి దిగకూడదనీ, ఒకవేళ బయట తిరి గితే, జ్వరం తిరగబెట్టే అపాయం ఉందనీ హెచ్చరించి మందులిచ్చి పంపాడు.

ఆ కారణంగా మురళి రెండు వారాల పాటు పడక నుంచి కిందికి దిగలేదు. మందులు మింగడం, మంచం మీద కదలా మెదలక పడుకుని ఉండడం వాడికి మహా కష్టమనిపించింది. కాళ్ళు చేతులు కట్టి పడేసినట్టయింది. జ్వరం తగ్గినా ఎందుకు బయటకు వెళ్ళవద్దంటున్నారో వాడికి అంతుబట్టలేదు. కిటికీ నుంచి బయటకు చూస్తూ, వీధిలో ఆడుకునే పిల్లల్ని చూసి, తను ఎప్పుడెప్పుడు వెళ్ళి వాళ్ళతో కలిసి ఆడుకుంటానా అని ఎదురు చూస్తూ, క్షణమొక యుగంగా గడపసా గాడు.

ఇంటి వసారాలో వేలాడగట్టిన పంజరం లోని చిలుక తన తల్లి అందించే గింజలను తింటూ, లోపలే అటూ ఇటూ తిరగడం- మురళి దిగులుగా గమనించసాగాడు.

ఆ రోజుతో వైద్యులు చెప్పిన గడువు ముగిసింది. మరునాడు తెల్లవారగానే, తల్లి మురళికి వేడినీళ్ళ స్నానం చేయించి, 'ఇక నువ్వు వెళ్ళి హాయిగా ఆడుకోవచ్చు,' అన్నది.

మురళి పంజరంతో సహా చిలుకను తీసుకుని వాకిట్లోకి వచ్చి, పంజరం తలుపు తీసి, 'పదిహేను రోజులు ఒక గదిలో పడు కుని ఉండడమే బందిఖానాలా అనిపిం చింది. అది ఎంతటి కష్టమో తెలిసింది. నిన్ను పంజరంలో బంధించి, హింసించను. వెళ్ళి హాయిగా, స్వేచ్ఛగా తిరుగు!' అంటూ చిలుకను వదిలిపెట్టాడు. చిలుక కిలకిల మంటూ ఎగిరిపోయింది. మురళి ముఖం ఆనందంతో ప్రకాశించింది!



# ఘనవిజయం

శివకోట మహారాజుకు ఊరికే ఉండటం విసుగెత్తి తన రాజ్యానికి పడమరగా ఉన్న చిన్న కోట మీదికి సైన్యాలు తీసుకుని యుద్ధానికి వెళ్లాడు. ఇదే సమయంలో శివకోట రాజ్యానికి తూర్పుగా ఉన్న పెదకోట రాజు శివకోట మీదికి దండెత్తి వచ్చాడు.

పెదకోట రాజు సైన్యంతో వస్తున్నాడని తెలియగానే శివకోటలో ఆందోళన బయలు దేరింది. శివకోటను రక్షించటానికి సైన్యం లేదు. ఒకప్పుడు శివకోట సేనానిగా పనిచేసి వృద్ధుడై పోయిన రణమల్లుడూ, అతనిలాగే మంచి పరాక్రమవంతులని ఒకప్పుడు పేరు పొంది వృద్ధాప్యం వచ్చేసిన ఇద్దరు ముగ్గురు యోధులూ మాత్రం ఉన్నారు.

రణమల్లుడు దీర్ఘంగా యోచించుకుని ఒక ఉపాయం ఆలోచించాడు. 'కోట తలుపు తెరవండి. ముఖద్వారానికి తోరణాలు అలంకరించండి. అక్కడ భాజాభజంత్రీలను ఏర్పాటు చేయండి,' అని ఉత్తరువిచ్చి, తాను మంచి దుస్తులు ధరించి, శాలువ కప్పుకుని నిలబడ్డాడు రణమల్లుడు. ఆయన పక్కనే ముసలి యోధులు నిలబడ్డారు.

శత్రుసేనలు కనుచూపు మేరలోకి రాగానే రణమల్లుడు, 'పెదకోట మహారాజావారికి జయం! జయం! స్వాగతం!స్వాగతం!' అని అరిచాడు. ఆయనతో పాటు మిగిలిన వాళ్లూ అరిచారు.

పెదకోట మహారాజు తన రథాన్ని ఆపించాడు. ఆయన వెనక ఆయన సేనలూ నిలిచిపోయాయి. 'జిత్తులమారి వెధవా! నీ సంగతి నాకు తెలీదా? కోటలోకి ఆహ్వానించి, లోపల దాచి ఉంచిన నీ సేనకు మమ్మల్ని బలిచేద్దామనుకున్నావా? నీ ఎత్తులు మన దగ్గిర పారవు,' అంటూ పెదకోట రాజు తన సేనను వెనక్కు తిప్పుకుని వెళ్లిపోయాడు.



# కెరీర్ అంటే?

ఈ నెల మనం ఒక విశిష్ట వృత్తిని గురించి తెలుసుకుంటున్నాము. దానిపేరు ఫోరెన్సిక్ సైంటిస్టు. 'ఫోరెన్సిక్ సైన్స్ లేదా ఫోరెన్సిక్స్ అనేది న్యాయ వ్యవస్థ నేర, సివిల్ దావాలను పరిశోధించే వివిధ శాస్త్రీయ పద్ధతులు, సూత్రాల అన్వయంతో ముడిపడి ఉంటుంది.'

నేరం జరిగిన స్థలం నుండి సేకరించబడిన అన్ని క్లూలను ఫోరెన్సిక్ శాస్త్రవేత్తలు నేర ప్రయోగశాలలో నుంచి విశ్లేషిస్తారు. వీటిని న్యాయస్థానాల్లో సమర్పించేందుకు అనువైన సాక్ష్యాలుగా మారుస్తారు. భౌతిక సాక్ష్యం అనేది రక్తం మరియు లవణాలు, వెంట్రుకలు, చక్రం మరియు షూల గుర్తులు, వేలిముద్రలు, పాదముద్రలు వంటి శరీర ద్రవ్యాలతో ముడిపడి ఉంటుంది. ఫోరెన్సిక్ శాస్త్రజ్ఞుడిగా మారడానికి కావలసిన ప్రధాన లక్షణాలు ఏవంటే విశ్లేషణాత్మక ఆలోచన, బృందంలో ఒకరుగా కలిసి పనిచేసే సామర్థ్యం, ఊహాశక్తి, సమాంతర ఆలోచన వగైరాలు.



ఫోరెన్సిక్స్ సైన్స్‌లో పలు విభాగాలున్నాయి. ఫోరెన్సిక్ ఆర్కియాలజీ, ఫోరెన్సిక్ బయాలజీ, ఫోరెన్సిక్ ఎకనమిక్స్, ఫోరెన్సిక్ ఇంజినీరింగ్, ఫోరెన్సిక్ జ్ఞానమీమాంస, ఫోరెన్సిక్ భాషాశాస్త్రం, ఫోరెన్సిక్ సైకాలజీ, ఫోరెన్సిక్ సెరోలజీ, ఫోరెన్సిక్ ఆంత్రోపాలజీ, ఫోరెన్సిక్ కంప్యూటింగ్ లేదా డిజిటల్ ఫోరెన్సిక్.

ఫోరెన్సిక్ సైన్స్‌లో పి.జి డిగ్రీ చదవాలంటే బి.ఎ లేదా బిఎస్‌సి డిగ్రీ కోర్సులో ప్రథమ శ్రేణిని సాధించాలి. సైన్స్ నేపథ్యం కలిగిన విద్యార్థులకు ప్రాధాన్యత ఉంటుంది. ఎంబిబిఎస్ డిగ్రీతోపాటు ఫోరెన్సిక్ సైన్స్‌లో స్పెషలైజేషన్ చేసిన వారు మాత్రమే శవాలపై శవపరీక్ష చేయగలరు. ఫోరెన్సిక్‌సైన్స్‌లో 60 శాతం మార్కులను సాధించిన పిజి విద్యార్థులు పరిశోధనకు అర్హులవుతారు.

ఈ కోర్సు పూర్తి చేసిన విద్యార్థులు పోలీసు బలగాలు, న్యాయ వ్యవస్థలు, కార్యనిర్వాహక లీగల్ సంస్థలు, ప్రభుత్వ, ప్రయివేట్ దర్యాప్తు కార్యాలయాలు వంటి రంగాలలో ఉద్యోగాలు సాధించగలరు. ఫోరెన్సిక్ ఆంత్రోపాలజీ, ఫోరెన్సిక్ ఆర్కియాలజీ, ఫోరెన్సిక్ సెరోలజీ వంటి పలు ఫోరెన్సిక్ సైన్స్ శాఖలు తమ తమ ప్రత్యేక విభాగాలలో అభ్యర్థులకు ఉపాధి కల్పించగలవు.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 43

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -43అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. సెప్టెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. నవంబర్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## స్వాతంత్ర్య పోరాటం

1. స్వాతంత్ర్య పోరాట కాలంలో లోకమాన్య తిలక్ ప్రారంభించిన వార్తా పత్రిక ఏది?
2. మహాత్మాగాంధీ 1942 ఆగస్టులో ప్రారంభించిన సుప్రసిద్ధ ఉద్యమం ఏది?
3. బాలాసోర్‌లో 1915వ సంవత్సరంలో పోలీసులతో జరిగిన సమరంలో ప్రాణత్యాగం చేసిన విప్లవకారుడు ఎవరు?
4. ఇండియన్ నేషనల్ ఆర్మీ ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది?
5. లోక్‌సభ ప్రథమ స్పీకర్ ఎవరు?
6. భారత రాష్ట్రపతి ప్రమాణ స్వీకారోత్సవాన్ని ఎవరు నిర్వహిస్తారు?
7. భారత స్వాతంత్రోద్యమ కాలంలో భగత్ సింగ్ లేవనెత్తిన నినాదమేది?
8. పోలీసు పాశవికత్వానికి బలయిన సందర్భంగా, లాలా లజపత్ రాయ్ పాల్గొన్న నిరసన ప్రదర్శన ఏది?
9. ఈస్ట్ ఇండియా కంపెనీ తన తొలి ఫ్యాక్టరీని ఎక్కడ స్థాపించింది?
10. శివాజీ ఉత్సవాలను ప్రారంభించి, భారతీయులలో దేశభక్తిని రగుల్కొల్పింది ఎవరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-40 సమాధానాలు:

1. బ్రహ్మగుప్త, భారతీయ గణిత శాస్త్రజ్ఞుడు; 2 శుశ్రుతుడు; 3. ఆర్యభట్ట; 4. జగదీష్ చంద్రబోస్; 5. చతురంగ; 6. తక్షశిల; 7. బోధాయన.

*మే'12 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేకపోతున్నాము.*



# నవ్వుల పువ్వులు



జోసెఫ్: ఓహ్. నీవు రాస్తున్నది రూ.5,000 చెక్ అన్నమాట.
రాహుల్: అవును, దీన్ని పుట్టినరోజు బహుమతిగా మా చెల్లికి పంపబోతున్నాను.
జోసెఫ్: కాని నువు చెక్కుమీద సంతకం చేయలేదే?
రాహుల్: చెక్‌ను ఎవరు పంపిందీ ఆమెకు తెలియనివ్వకూడదనీ.




వినియోగదారు: ఆ స్ట్రాబెర్రీలు వారం క్రితం కోసినవి లాగా కనబడుతున్నాయి. కానీ మీ బోర్డు మాత్రం తాజా పళ్లు అని చూపిస్తోందేమిటి?
కూరగాయల వ్యాపారి: మీరు చెప్పింది నిజమే. బోర్డుపై ప్రకటన తాజాదే. దాన్ని ఇంతకు ముందే రాశాను మరి.



సార్జెంట్ (కొత్తసైనికుడితో): సైన్యంలో చేరకముందు నీవెలా ఉండేవాడివి?
కొత్త సైనికుడు: సంతోషంగా ఉండేవాడిని సార్జెంట్.



కొత్తగా కారు కొన్నతను కార్ డీలర్ వద్దకు వచ్చాడు.
'నా కారుతో పాటు వారంటీ కూడా ఇచ్చారు.'
'అవును సర్,' సమాధానమిచ్చాడు డీలర్.
'ఏది విరిగినా దాన్ని మార్చి కొత్తది ఇస్తాము కూడా.'
'మంచిది! నాకు కొత్త గ్యారేజ్ తలుపు కావాలి.'



కోపిష్టి బాస్ తన బాయ్‌తో: ఈ ఉదయం కూడా నీవు ఆలస్యంగా వచ్చావు
ఆఫీస్ బాయ్: రాత్రి ఎక్కువగా నిద్రపోయాను సర్.
కోపిష్టి బాస్: అంటే నీవు ఇంట్లో కూడా మామూలుగానే నిద్రపోయావన్న మాట?



ప్రయాణీకుడు: ఇది నా రైలేనాండీ?
టికెట్ కలెక్టర్: కాదు కాదు. ఇది ఇండియన్ రైల్వేస్‌ది.
ప్రయాణీకుడు: పరాచాకాలొద్దు. నేను ఈ రైలును కేరళకు తీసుకెళ్లగలనా అని.
టికెట్ కలెక్టర్: లేదు సర్ ఇది చాలా బరువైనది.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | He is a famous director | There was nothing new |
|---|---|---|
| Telugu | అతడు ప్రసిద్ధ దర్శకుడు. | దానిలో కొత్త విషయం లేదు. |
| Hindi | वह एक प्रख्यात निर्देशक है।<br>వహ్ ఏక్ ప్రఖ్యాత్ నిర్దేశక్ హై. | कुछ भी नया नहीं था।<br>కుచ్ బి నయా నహీథా. |
| Tamil | அவர் ஒரு பிரபல இயக்குனர்.<br>అవర్ ఒరు ప్రబల ఇయక్కునార్. | அதில் புதிதாக ஒன்றுமில்லை.<br>అదిల్ పుధిత్తాక ఒన్రుమిల్లై. |
| Bengali | তিনি একজন বিখ্যাত নির্দেশক।<br>తిని ఎకోజన్ బిఖ్యాతో నిర్దేశక్. | সেখানে নতুন কিছুই ছিল না।<br>సెఖానే నూతన్ కిచుయి చిలో న. |
| Marathi | तो खूप प्रसिद्ध दिग्दर्शक आहे.<br>తో ఖుప్ ప్రసిద్ధ దిగ్దర్శక్ ఆహె. | त्यात काही नवीन नाही.<br>త్యాత్ కహి నవిన్ నాహి. |
| Kannada | ಅವರು ಖ್ಯಾತ ನಿರ್ದೇಶಕರು<br>అవరు ఖ్యాత నిర్దేశకరు. | ಅಲ್ಲೇನೂ ಹೊಸತು ಇರಲಿಲ್ಲ<br>అల్లెనూ హొసతు ఇరలిల్ల. |
| Odia | ସେ ଜଣେ ପ୍ରସିଦ୍ଧ ନିର୍ଦ୍ଦେଶକ।<br>సె జనె ప్రసిద్ధ నిర్దేశక. | ସେଠାରେ କିଛି ନୂଆ କଥା ନଥିଲା।<br>సె థారె కిచ్చి నోవా కథా నథిలా. |
| Gujarati | તે એક પ્રખ્યાત નિર્દેશક છે.<br>తె ఎక్ ప్రఖ్యాత నిర్దేశక్ చ్చె. | ત્યાં કંઈ નવું નહોતું.<br>త్యాన్ కే నవు నహొతు. |
| Assamese | তেওঁ এগৰাকী বিখ্যাত নিৰ্দেশক।<br>టేవు ఎగోరాకి బిఖ్యాత్ నిర్దేశక్. | ইয়াত একো নতুন নাই।<br>ఎయత్ ఎకు నతున్ నాయి. |
| Malayalam | അയാൾ ഒരു പ്രസിദ്ധ സംവിധായകനാണ്.<br>అయల్ ఒరు ప్రసిద్ధ సంవిధాయకనను. | പുതുതായി ഒന്നുമില്ലായിരുന്നു.<br>పుత్తుతయి ఒన్నుమిల్లాయిరున్ను. |
| Santali | ᱩᱱᱤ ᱱᱩᱴᱩᱢᱟᱱ ᱩᱫᱩᱜᱤ ᱠᱟᱱᱟᱭ<br>ఉని నుటుమన్ ఉదుగ్గి కనయ్ | ᱚᱸᱰᱮ ᱪᱮᱫ ᱦᱚᱸ ᱱᱟᱶᱟ ᱵᱟᱝ ᱛᱟᱦᱮᱸᱱᱟ<br>ఒండె చెడ్ హోన్ నవ బంగ్ టహెన్య |
| Sanskrit | स: सुप्रसिद्ध: दिग्दर्शक: अस्ति।<br>సః సుప్రసిద్ధః దిగ్దర్శకః అస్థి. | तत्र किमपि नूतनं नास्ति।<br>తత్ర కిమపి నుతనం నాస్తి. |





| English | It was very boring | This is my favourite actor |
|---|---|---|
| Telugu | ఇది చాలా విసుగెత్తించింది. | ఇతడు నా అభిమాన నటుడు. |
| Hindi | वह बहुत उबाऊ था।<br>వహ్ బహుత్ ఉబావూ థా. | यह मेरा प्रिय अभिनेता है।<br>యహ్ మేరా ప్రియ అభినేతా హై. |
| Tamil | அது அலுப்பாக இருந்தது.<br>అదు అలుప్పాగ ఇరుంధత్తు. | எனக்குப் பிடித்த நடிகர் இவர்.<br>ఎనక్కు పిడిత్త నడిగర్ ఇవర్. |
| Bengali | সেটা খুব বিরক্তিকর ছিল।<br>ఇని ఆమార్ ప్రియో ఒభినేత. | ইনি আমার প্রিয় অভিনেতা।<br>ఆమి అబోషియోయి సెటా దెఖబో. |
| Marathi | ते खूप कंटाळवाणं होतं.<br>తె ఖుప్ కంటల్వన హోతా. | हा माझा खूप आवडता अभिनेता आहे.<br>హా మజ ఖుప్ అవడతా అభినేత అహె. |
| Kannada | ಅದು ತುಂಬಾ ಬೋರಿಂಗ್ ಆಗಿತ್ತು<br>అదు తుంబా బోరింగ్ ఆగిత్తు. | ಇವರು ನನ್ನ ನೆಚ್ಚಿನ ನಟ<br>ఇవరు నన్న నెచ్చిన నట. |
| Odia | ଏହା ଭାରି ବିରକ୍ତିକର ଥିଲା।<br>ఏహా భారి బిరక్తికార థిలా. | ସେ ମୋର ପ୍ରିୟ ଅଭିନେତା।<br>సె మొర ప్రియ అభినేతా. |
| Gujarati | તે ખૂબ કંટાળાજનક હતું.<br>తె ఖూబ కటాలాజనక హతు. | આ મારો મનપસંદ અભિનેતા છે<br>ఆ మారో మనపసంద్ అభినేతా చ్చె. |
| Assamese | ই বৰ আমনি লগা আছিল।<br>ఎ బోర్ ఆమోని లోగా ఆసిల్. | এয়া মোৰ প্ৰিয় অভিনেতা<br>ఎయియా ముర్ ప్రియో అభినేత. |
| Malayalam | അത് വളരെ മടുപ്പുളവാക്കുന്നതായിരുന്നു.<br>అథు వలరే మాదుప్పులవక్కున్నాథయిరన్ను. | ഇതാണ് എന്റെ പ്രിയപ്പെട്ട നടൻ.<br>ఇథను ఎంటె ప్రియపెట్ట నదన్. |
| Santali | ᱱᱚᱣᱟ ᱟᱫᱤ ᱵᱮᱠᱚᱨ ᱛᱟᱦᱮᱱ ᱠᱟᱱᱟ<br>నొవ ఆది బెకర్ తహెన్ కన | ᱱᱩᱭ ᱮᱠᱴᱚᱨ ᱟᱫᱤᱧ ᱠᱩᱥᱤ ᱟᱭᱟ<br>నుయి ఎక్టర్ అధిన్జి కుసి అయ |
| Sanskrit | अतीव नीरसम् आसीत्।<br>అతీవ్ నీరసం అశీత్. | एषः मम प्रियः अभिनेता।<br>ఎషః మమ ప్రియః అభినేత. |

# భారత దర్శిని

## మన జాతీయ గీతం



జనగణమణ బెంగాలీ మూలగీతాన్ని రవీంద్రనాథ్ టాగూర్ కవీంద్రులు 1911లో రచించి తత్వబోధ ప్రకాశికలో ప్రచురించారు. ఐరిష్ కవి, బీసెంట్ థియసాఫికల్ కాలేజ్ ప్రిన్సిపాల్ అయిన జేమ్స్ హెచ్ కజిన్స్, ఆహ్వానంపై 1919లో రవీంద్రుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం చిత్తూరు జిల్లాలోని మదనపల్లెను సందర్శించారు. ఫిబ్రవరి సాయంత్రాన, డాక్టర్ కజిన్స్, అతడి భార్య మార్గరెట్, మరికొందరు విద్యార్థులు రవీంద్రులు రచించిన బెంగాలీ గీతాన్ని పాడమని కోరారు. పాట చివరలో జయహే జయహే వద్దకు రాగానే అక్కడ చేరివున్న జనమంతా టాగూర్‌తో వంత పలికారట. మదనపల్లెలో ఉండగానే టాగూర్ ఈ పాటను ఇంగ్లీషులో రాశారు.

ప్రధాని జవహర్‌లాల్‌నెహ్రూ 1948 ఆగస్టు 15న ఢిల్లీలోని ఎర్రకోటపై తొలిసారిగా జాతీయ జెండా ఎగురవేసినప్పుడు, సిక్ రెజిమెంట్ డాక్టర్ కజిన్స్ స్వరకల్పన చేసిన జాతీయ గీతాన్ని ఆలపించింది. నాటి నుండి దాన్ని ఆ వరుసలోనే పాడుతున్నాము.

## తొలి స్వాతంత్ర్య వీరులు



భారతీయ పితూరీ 1857 మార్చి 29న ప్రారంభమైంది. బరక్‌పూర్‌లో విడిది చేసి ఉన్న బ్రిటిష్ రెజ్‌మెంట్‌కి చెందిన సిపాయి మంగళపాండే తన బ్యారక్ నుండి ఆరోజే బయటకు వచ్చి ఒక బ్రిటిష్ అధికారిని కాల్చి చంపాడు. విదేశీ పాలన నుండి స్వాతంత్ర్యం కోరినందుకు ఉరితీయబడిన తొలి అమరుడు ఇతడే. అయితే సిపాయి తిరుగుబాటు వెల్లూరు (1806)లో, విశాఖపట్నం (1780)లో, మదురై (1763)లోనే ప్రారంభమయిన విషయం చాలా కొద్ది మందికే తెలుసు. భారతీయ సిపాయిలు బ్రిటిష్ సైనికులను, పౌరులను కాల్చిచంపడంతో విశాఖలో తిరుగుబాటు ప్రారంభమైంది. వారి నాయకుడు మేజర్ షేక్ మహమూద్. మద్రాసు (ఇప్పుడు చెన్నయ్)కు నౌకను తరలించవలసిందిగా సైనికులకు ఆదేశాలు జారీ చేసినప్పుడు వారు తిరగబడ్డారు. వాళ్లు పలువురు అధికారులను బందీలుగా పట్టుకుని విశాఖకు పారిపోయారు. కొద్ది కాలంలోనే వారు పట్టుబడ్డారు. కొద్దిమంది అధికారులు, సిపాయిలు ఈ చర్యలో చంపబడ్డారు. షేక్ మహమూద్‌ను విచారించి తర్వాత ఉరితీశారు కూడా.

CHANDAMAMA'S

# Ramayana

*An Epic Journey*






Follow the epic journey of Prince Rama, from his birth to his exile, from the abduction of his wife, Sita, to his great war with the Asura King, Ravana, in Chandamama's latest offering: Ramayana - An Epic Journey.

**Price: Rs 449/-**

To place an order, go to www.chandamama.com

Chandamama's Ramayana is available only in English at all leading book shops.

## విదూషకుడు బీర్బల్



# ఎన్ని కాకులు?



1. ఒక వేసవి ఉదయాన, అక్బర్, బీర్బల్ వాహ్యాళి కెళుతున్నారు. 'వేసవి ఇంకా మొదలైనట్లు లేదు. ఇంకా చల్లగాలి వీస్తోంది,' అని అక్బర్ వ్యాఖ్యానించాడు



2. 'షహెన్‌షా, వసంతాన్ని ఆస్వాదిస్తున్నట్లుగా పక్షులు ఇంకా కువకువలాడుతున్నాయి,' చెట్లవైపు చూపిస్తూ బీర్బల్ వ్యాఖ్యానించాడు.



3. కాస్సేపట్లో వారు పక్షులు నీళ్లు తాగుతున్న తటాకం వద్దకు వచ్చారు. ఉన్నట్లుండి అక్బర్‌కు బీర్బల్‌ను ఆటపట్టించాలనిపించింది.



4. 'బీర్బల్, ఈ తోటలో ఎన్ని కాకులున్నాయో చెప్ప గలవా?' అడిగాడు చక్రవర్తి. ఒక్క క్షణం బీర్బల్ విస్తుపోయాడు.



5. మరుక్షణం, అతడు 'ఒకటి, రెండు మూడు, తొంబై వేల నాలుగు వందలు, తొంబై అయిదు వేల నాలుగు వందల అరవై మూడు కాకులు,' అని చెప్పాడు.



6. అక్బర్ అంత సులభంగా బీర్బల్‌ను వదల దల్చుకోలేదు. 'నీవు లెక్కించిన సంఖ్య కంటే ఎక్కువ కాకులు ఉంటే..' అని ప్రశ్నించాడు.



7. 'మరిన్ని కాకులు ఉన్నట్లయితే..' అంటూ ఎదుర్కొన్నాడు బీర్బల్. 'అప్పుడు అవి పొరుగు రాజ్యం నుంచి వచ్చి ఉంటాయి.' బీర్బల్ ముఖంపై నవ్వు పులుముకున్నాడు.



8. అక్బర్ కొనసాగించాడు. 'ఒకవేళ నువ్వు చెప్పిన సంఖ్యకంటే తక్కువ కాకులు 'ఉన్నట్లయితే?' తెలివైన ప్రశ్నతో బీర్బల్‌ను బురిడీ కొట్టించానని చక్రవర్తి ఆనందపడ్డాడు.



9. బీర్బల్ వెంటనే సమాధానమిచ్చాడు. 'మన కాకులు కొన్ని ఇతర రాజ్యాలను సందర్శిస్తూంటాయి,' దీంతో అక్బర్ పరాజయాన్ని అంగీకరించాడు. 'నిన్ను మించిన వాడు లేడు బీర్బల్,' అన్నాడు చక్రవర్తి.

## హామ్ రేడియోలు

మనం వైపరీత్యాల రూపంలో ప్రకృతి ఆగ్రహానికి గురైనప్పుడు, మనం నిస్సహాయులమైనట్లు భావిస్తాము. తుఫాను దాడి చేసినప్పుడు, సకల కమ్యూనికేషన్ వ్యవస్థలు విఫలమైనప్పుడు, మనం ఏం చేస్తాము? సులభమైన పరిష్కారం హామ్ లేదా అమెచూర్ రేడియో. హామ్ రేడియోలు ప్రపంచమంతటికీ సంకేతాలు పంపిస్తాయి, ఇతర హామ్ రేడియోల నుంచి సంకేతాలు అందిస్తాయి.

హామ్ రేడియో అనేది రేడియో స్టేషన్, రేడియో రిసీవర్‌ని కలిపి నిర్మించిన పరికరం. ఇంటినుంచి రేడియో స్టేషన్‌ను నిర్వహించడం లాంటిది. హామ్ రేడియో సెట్ పనిచేయసాగిందంటే, ఎవరైనా ఒక చానెల్‌లోకి ట్యూన్ చేయగలరు. (మీరు రేడియో స్టేషన్లకు ట్యూన్ చేసినట్లు) ఆ చానెల్‌లో అందరికీ రేడియో సందేశాలను పంపి స్వీకరించగలరు. ఆన్‌లైన్‌లో చాటింగ్ చేసినట్లే కానీ కంప్యూటర్‌కి బదులు రేడియో సెట్ నుండి ఆ పని చేస్తారన్నమాట.

# జాతీయ చిహ్నాలు

ఈ నెల మనం మన జాతీయ చిహ్నాలతో స్క్రాప్ బుక్ తయారు చేద్దాము.



త్రివర్ణ పతాకం



కమలం



పులి



మర్రిచెట్టు



నెమలి



మామిడిపండు

ఆషాఢం సేల్

ఓ నా ప్రియమైన చిన్నారి...
మీ అక్కను చూడు......
మనం పెద్దగా అవుతున్న కొద్దీ....
మన ఆకాంక్షలు కూడా పెద్దవి అవుతున్నాయి...
చాలా కొత్త బట్టలు కొనుక్కుందాం...
డిస్నీలాండ్ కు వెళదాం...... వీటన్నింటికీ మనకు
పెద్దమొత్తంలో డబ్బు కావాలి.... కనుక మనం ఎంతో
జాగ్రత్తగా ఖర్చు పెడదాం......
మరింత ఎక్కువ పొదుపు చేద్దాం.....
ఇప్పుడు మనం
పోతీస్ కు వెళదామా, ఒకే?

ఆషాఢం
ఆదా
5% నుండి 50% వరకు

# పోతీస్‌తో మీ పొదుపును ప్రారంభించండి



పోతీస్®

అందమైన వస్త్రాల ఆలయం

ఉస్మాన్ రోడ్డు, పనగల్ పార్క్, టి.నగర్, చెన్నై -17, ఫోన్ : 044-2431 0901, బేస్‌మెంట్ కార్ పార్కింగ్
శ్రీవిల్లిపుత్తూర్ • తిరునల్వేలి • మదురై • కోయంబత్తూర్ • తిరువనంతపురం • | Online Shopping at www.pothys.com

